# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు







ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



# దిలీప్ బృందం

## జంతు ప్రదర్శనశాల దర్శించనున్నారు!























1. కవురు సత్యనారాయణ, పేరుపాలెం

అన్నయ్యా, రావణుడు దశకంఠు డంటారు గదా ? మీరు ఏక శిరస్కుడిగా చిత్రించే వారేం ?

రావణుడు కామరూపి. సర్వకాలసర్వావస్థలయందూ పది తలలతో అగచాటుపడ నవసరం లేదు. అదీగాక పది తలల రావణుణ్ణి చిత్రించటం వల్ల చిత్రానికి శోభరాదు.

2. కె. ఎ. ఎల్. ఎస్. దేవి, అలంపూర్

రాముడు రావణుని బ్రహ్మాస్త్రంతో చంపాడని వేశారు. విభీషణుడు రామునితో తన అన్న కడుపులో అమృతభాండమున్నదనియు, దానిని భేదించినగాని అతను చావడనియు తెలపిన మీదట రాముడు రావణుని సంహరించెనని నేను వింటిని. ఏది తప్పు ?

ఈ అమృతభాండం కథ విచిత్ర రామాయణంలో ఉన్నట్టు కనబడుతుంది. వాల్మీకి రచించిన యుద్ధకాండలో మటుకు ఆ కథ లేదు. (ఈ ప్రశ్నే ఇంకా అనేకమంది పాఠకు లడిగారు.)

3. యద్దనపూడి రామకృష్ణ, యద్దనపూడి

"అంగారవతి" కథ చాల బాగున్నది. కాని నా కొక సందేహము గలదు. అంగారవతి తన తండ్రిని ఎందుకు చంపాలి ?

అంగారవతి తన తండ్రిని చంప లేదు. తన ప్రియుడు తన తండ్రిని చంపుతాడని కూడా ఆమెకు తెలిసి ఉండకపోవచ్చు.

4. ఆర్. వెంకోబారావు, నెల్లూరు

మామయ్యా, విక్రమార్కుడు సమాధానం చెప్పలేని కథ బేతాళుడు చెప్పలేడా ? బేతాళ కథలు ఎప్పటికి అవునో తెల్ప గోరుతాను.

విక్రమార్కుడు సమాధానం చెప్పలేని కథ బేతాళుడు చెప్పిన క్షణంలో ఓడిపోతాడు. అందుచేత బేతాళుడు ఓడిపో దలచుకున్నప్పుడే సమాధానం లేని ప్రశ్న వేస్తాడు. మనకు కావలిసింది బేతాళ కథలు అయిపోకుండా ఉండటం. ఇవి ఇతర కథల వంటివి కావు; వీటిలో నీతి, ధర్మసూక్ష్మమూ, మనస్తత్వ పరిశీలనా మొదలైన రకరకాల అంశాలుంటాయి. బేతాళ కథలు ఎప్పుడయిపోతాయా అని చూసే పాఠకులుంటారంటే మాకు నమ్మకం కలగటం లేదు.

5. జే. సూర్యనారాయణరావు, గద్వాల్

రామాయణం ఇంకా ఎంత కాలం నడుస్తుంది ?

ఉత్తరకాండ అయిపోయేదాకా నడుస్తుంది.

6. దొరైకణ్ణన్, అనంతపురం

అన్నయ్యా, రేడియో ప్రసారములో ఇచ్చిన మీటర్లు కిలోసైకిల్సును గుణించిన 30 కోట్ల మీటరు-సైకిల్స్ వస్తవి గదా ; మీటరుకు, సైకిలుకు గల వ్యత్యాస మేమిటి ? మీటర్, సైకిల్ ఎందుకు విలోమానుపాతములో ఉంటవి ?

30 కోట్ల మీటర్లు అనేది రేడియో తరంగాలు ఒక సెకండు కాలంలో ప్రయాణించే దూరం. "మీటర్లు" అన్నది రేడియో తరంగాల నిడివి. సెకండుకు ఒకే కంపనం గల (ఒకే సైకిల్ గల) రేడియో తరంగాన్ని మనం ఊహించుకో గలిగితే దాని నిడివి 30 కోట్ల మీటర్లుంటుంది. సైకిల్స్ సంఖ్య పెరిగినకొద్దీ తరంగాల నిడివి తగ్గుతుంది. మనకు రేడియో ప్రసారవేగం తెలిసినట్టయితే ఎన్నిమీటర్ల తరంగాలో చెబితే ఎన్ని సైకిల్స్ ఉండేదీ తెలుసుకోవచ్చు.

7. శ్రీకంటి సత్యనారాయణ, హైదరాబాదు

సూర్యకిరణాలు వర్షపు బిందువుల్లో ప్రసరించగానే వర్ణవిశ్లేషణ చెంది ఇంద్ర ధనుస్సు ఏర్పడుతుంది. అది ధనుస్సు అకారములోనే ఉండుటకు కారణ మేమిటి ?

వర్ణవిశ్లేషణం అన్ని వైపులకూ ఒకే ప్రమాణంలో జరుగుతుంది గనక వర్ణమాల వలయా కారంలో ఏర్పడుతుంది. అయితే ఆకాశంలో ఏర్పడే ఇంద్రధనుస్సు సాధారణంగా మనకు అర్ధవలయానికి తక్కువే కనిపిస్తుంది. అందుచేత అది ధనుస్సు అకారంలో ఉందనుకుంటాం. నోటిలో నీళ్లు పోసుకుని సూర్యుడి కెదురుగా తిరిగి తుపర తెప్పించినట్టయితే "ఇంద్ర ధనుస్సు" సంపూర్ణవలయంగా కనిపిస్తుంది.

8. యం. శివనాగయ్య, నంద్యాల

రేడియో కిరణాలంటే ఏమిటి ? మానవునికి రోదసిలో వీనివలన కలుగు నష్టా లేమిటి ?

సూర్యుడి నుంచి కాంతి మాత్రమే గాక ఇంకా అనేక రకాల కిరణాలూ, శక్తియుతమైన సూక్ష్మకణాలూ ప్రసారమవుతున్నాయి. వీటిలో కొన్ని మనిషి ఆరోగ్యానికి చాలా హాని కలిగిం చేవి. భూమిపైన ఉన్న మనం ఈ ప్రసారాలకు గురి కాకుండా గాలిపొర కాపాడుతున్నది. ఈ గాలిపొరలోనే అనేక రకాల ప్రసారం ఆగిపోతున్నది. అంతరిక్షంలోకి వెళ్లే మానవులకు గాలిపొరయొక్క రక్షణ ఉండదు. అందుచేత వారు కృత్రిమరక్షణలు కల్పించుకోవాలి.

# వచ్చే సంచిక నుండి

# చందమామ

| విడి సంచిక | సాలు చందా | రెండేండ్లకు |
| --- | --- | --- |
| 0-75 పైసలు | రు. 8-40 | రు. 15-60 |

ఏజంట్లు, పాఠకులు ఈ మార్పును గమనించవలెను.

పాత చందాదారులకు ఈ మార్పు వర్తించదు. కాని, ఇప్పటి చందా గడువు తీరిన వెంటనే, చందాను మరల పొడిగించేటప్పుడు, కొత్తరేటు ప్రకారము పంపవలెను.



వివరములకు :

**చందమామ పబ్లికేషన్సు,**

వడపళని :: మద్రాసు-26.

# "సుగుణ వివాహ సమస్య"

భార్య :—ఏమండీ! మన అమ్మాయికి ఎన్ని సంబంధాలు వచ్చినా ఒక్కటి కూడా కుదరలేదే! కట్నం–కాస్త ఎక్కువైనా పర్వాలేదు. త్వరలో మన సుగుణకు వివాహం అయ్యేలా చూడండి.

భర్త :—నన్ను ఏమి చెయ్యమంటావే... నేను మాత్రం ఫూరుకున్నానా ఏమిటి? ఎంతో డబ్బు ఖర్చుపెట్టూ, కష్టపడి గాలిస్తూనే ఉన్నాను, వరుడి కోసం...ఏదీ ఒక్క సంబంధమైనా కుదిరితేగా... కట్నం ఎక్కువ ఇస్తాము అని చెప్పుకోవటానికి.

భార్య :—ఎలాగ మరి! ఈ శుభముహూర్త కాలం కాస్త దాటిపోక ముందే అమ్మాయికి వివాహం జరిగేలా చూడండి.

భర్త :—నీ కోరిక బాగానే ఉంది. గానీ! మన అమ్మాయికి ఆ అదృష్టం ఉండవద్దూ? ఆ ముఖం అందవిహీనంగా ఉండగాబట్టేగా వచ్చిన సంబంధాలన్నీ తిరిగి వెళ్తున్నాయి!

(వీళ్ళ సంభాషణ వింటూ మిత్రు డొకడు ప్రవేశిస్తాడు)

మిత్రుడు :— కంగారు పడకండి! ఆ వచ్చిన వరుడి కంటికి మీ అమ్మాయి ముఖం అందంగా కనిపిస్తే చాలు! వెంటనే పెండ్లి జరిగేదేగా···

భార్య :—ఆ! ఎంత మంచిమాట చెప్పారూ.

భర్త :—ఏమిటో మిత్రమా! మా ఆశలన్నీ నిరాశ లయ్యాయి...పుట్టుకతో వచ్చిన రూపం సుగుణ ముఖం. అందంగా ఎలా చేయగలం చెప్పండి?

మిత్రుడు :—డోన్టు వర్రీ మిత్రమా! మీ అమ్మాయి ముఖాన్ని జగదేకసుందరిలా అందంగా తయారు చేయగలం. మానవులకు సాధ్యంకాని దేదీ ఈ రోజుల్లో....ప్రఖ్యాతి గాంచిన విజయా కెమికల్స్ (మద్రాసు) వారి శాండల్ పౌడర్సు ఉపయోగిస్తే చాలు....

భార్యా—భర్త లిద్దరూ :—అలాగే!! అయితే ఆ విజయా కెమికల్స్ వివరా లేమిటో విపులంగా తెలపండి....నేడే కొనేస్తాము.

మిత్రుడు :—అలాగే. విజయా కెమికల్స్ మద్రాస్‌వారు మూడు రకాలుగా శాండల్ పౌడర్స్ తయారు చేయుచున్నారు. అవి (1) అశోకా శాండల్ ఫేస్ పౌడరు (ఫాన్సీ ప్లాస్టిక్ డబ్బాలో) దీనిని ముఖమునకు ఉదయం, సాయంత్రం ప్రతి దినము క్రమముగా ఉపయోగించిన ముఖముపైన మొటిమలు, గుల్లలు మొదలయిన వాటిని రూపుమాపి బాగా అందముగా తయారు అవుతుంది. (2) అశోకా శాండల్ అండ్ ఆల్ పర్పస్ పౌడర్. దీనిని స్నానానంతరం శరీరమంతా చల్లుకో వచ్చును. (3)అశోకా శాండల్ టాల్కం పౌడర్. దీనిని టాయిలెట్‌గా ఉపయోగించవచ్చును.

పై మూడింటినీ మీ అమ్మాయి ఉపయోగిస్తే అప్సరసలా తయారవుతుంది. మీరు అనుకున్నంత త్వరలో సుగుణ వివాహం అమితానందంగా జరిగి పోతుంది.

(కొద్ది రోజుల తరవాత—పెండ్లి చూపులకు వచ్చినవారు సుగుణ ముఖం అందానికి ముగ్ధులై నారు. సుగుణనే వివాహం చేసుకుంటాను అని వరుడు తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.)

వరుడి తల్లిదండ్రులు :—మీ అమ్మాయి చాలా అందంగా ఉంది. మా అబ్బాయికి మనస్ఫూర్తిగా నచ్చినది. కట్నాలు కానుకలు మాకు అక్కరలేదు. మీ అందాల బొమ్మ సుగుణను మా అబ్బాయికి ఇచ్చి వివాహం జరిపిద్దాము. ముహూర్తం పెట్టండి.

వధువు తల్లిదండ్రులు :—ఇక ఆలస్య మెందుకు. పై వారంలో మాంచి లగ్నములు ఉన్నాయి. శుభస్య శీఘ్రం...

సుగుణ :—విజయా కెమికల్స్ (మద్రాసు) వారికి నా జీవితాంతము కృతజ్ఞతలు తెలుపుకుంటాను. మరియూ మా తండ్రిగారి మిత్రులకు నా కృతజ్ఞతలు తెలుపుకుంటాను. విజయా కెమికల్స్ వారు తయారుచేస్తున్న అశోకా శాండల్ పౌడర్సు మూడు రకాలను నేను ఉపయోగించి నందువలననే నేను అందగత్తెగా తయారయ్యాను. నా తల్లిదండ్రులకు అట్టే శ్రమ లేకుండా నా వివాహం జయప్రదంగా జరిగిపోయింది.

మీరు కూడా ఉపయోగించండి.

రచన : అషా                                    నమస్తే.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

వచ్చే జులై సంచిక నుంచి "చందమామ" వెల 75 పైసలకు పెంచవలిసి వచ్చిందని మా పాఠకులకు తెలపటానికి విచారిస్తున్నాం. ఆ రోజు కారోజు పన్నులూ, సుంకాలూ పెరిగి పోతున్నాయి. ఈ పరిస్థితిలో పేజీల సంఖ్య తగ్గించటంకంటే "చందమామ" ధర పెంచటమే పాఠకులకు సమ్మతంగా ఉంటుందని భావించి ఈ నిర్ణయం చేశాం.

అయినప్పటికీ "చందమామ"కు రెండేళ్ళు చందా కట్టే వారిని ఈ ధర హెచ్చింపు అంతగా బాధించదు. వారు ఈనాడు "చందమామ" సంచికకు ఇస్తున్న దాని పైన 5 పైసలు మాత్రమే అదనంగా ఇస్తారు. ఏడాది చందా కట్టే వారికి సంచిక 10 పైసలు జాస్తి పడుతుంది.

సంపుటి : 36 - జూన్ 1965 - సంచిక : 6



# భారత చరిత్ర




**1595** నాటికి అక్బరు సామ్రాజ్యం హిమాలయాల నుంచి నర్మదా తీరం దాకానూ, హిందూకుష్ పర్వత పంక్తి నుంచి బ్రహ్మపుత్రానదీ తీరం దాకానూ విస్తరించింది. అక్బరు తన సామ్రాజ్యాన్ని దక్కనుకు కూడా విస్తరింపజేసి, అహమ్మద్ నగర్, బిజాపూర్, గోల్కొండ, ఖాన్దేష్ సల్తనతులను లోబరుచుకోవాలని ఆలోచించాడు. పోర్చుగీసు వారిని సముద్ర తీరం నుంచి లోపలికి రాకుండా చెయ్యాలనే ఉద్దేశం కూడా అక్బరుకున్నది.

దక్షిణదేశం లోని సల్తనతులు పరస్పర కలహాలతో దుర్బలమైపోయి ఉండటం చేత మొగలులను నిరోధించే స్థితిలో లేవు. 1591 లో అక్బరు ఈ సంస్థానాలకు తన రాయబారులను పంపి, వారు తనకు లోబడి ఉండేటట్టు అంగీకరించమని కోరాడు. కాని ఒక్క సుల్తాను కూడా అందుకు స్పష్టంగా అంగీకరించలేదు. ఖాన్దేష్ నవాబు మియాబహదుర్‌షా నిరాకరించాడు కూడా.

దౌత్యం విఫలం కాగా, అక్బరు తన రెండో కొడుకు మురాద్‌నూ, బైరమ్‌ఖాన్ కొడుకు అబ్దుర్రహీమ్‌నూ సేనాపతులుగా చేసి పెద్దసేనను అహమ్మద్‌నగరు పైకి పంపాడు. 1595 లో ముట్టడి జరిగింది. చాంద్‌బీబీ ఈ ముట్టడిని సాహసోపేతంగా ప్రతిఘటించింది. మొగలులు ఆమెతో 1596 లో సంధి చేసుకుని, బిరార్ తమ అధీన మయేటట్టూ, బాలుడైన చాంద్‌బీబీ కుమారుడు అహమ్మద్‌నగరు రాజుగా ఉంటూ అక్బరు ఆధిపత్యాన్ని ఆమోదించేటట్టూ ఒడంబడిక చేసుకున్నారు. చాంద్‌బీబీ తన పరిపాలన వదిలేసుకున్నది. అయితే ఆమె సలహాకు భిన్నంగా అహ్మద్‌నగరు లోని ఒక పక్షం వారు ఒడంబడికను

## 45. అక్బరు నిర్యాణం

ఉల్లంఘించి, బిరారు నుంచి మొగలులను తరిమెయ్యటానికి యుద్ధం సాగించారు. 1597 ఫిబ్రవరిలో గోదావరీ తీరాన సూప పద్ద మొగలులకు విజయం లభించింది. చాంద్ బీబీ దుర్మరణం పొందింది. 1600 లో మొగలులు అహమ్మద్‌నగరును సునాయాసంగా వశపరచుకున్నారు.

ఖాన్దేష్ విజయానికి అక్బరు స్వయంగా బయదేరాడు. అది అతని అఖరు విజయం. అప్పటికే అక్బరు పైన అతని కొడుకు సలీమ్ తిరుగుబాటు చేసి, అలహాబాదుకు వెళ్ళి తానొక స్వతంత్ర రాజు నని ప్రకటించాడు. అతను 1602 లో తన తండ్రికి అత్యంత ఆప్తమిత్రుడైన అబుల్ ఫజల్‌ను హత్య చేయించాడు. 1603 లో సుల్తానా సలీమా బేగమ్ తండ్రి కొడుకులకు తాత్కాలికంగా రాజీ కుదిర్చింది గాని, అది దక్కలేదు. సలీమ్ మళ్ళీ అలహాబాదుకు వెళ్ళిపోయి, అదరగండంగా ప్రవర్తించ సాగాడు. మానసింహుడు మొదలైన కొందరు అక్బరు సింహాసనాన్ని సలీమ్ కొడుకైన ఖుస్రవ్‌కు వచ్చే ఏర్పాటు చేయాలన్నారు, కాని మరి కొంద రిందుకు వ్యతిరేకించారు. అక్బరు కొడుకుల్లో అప్పటికి సలీమ్ ఒకడే సజీవుడుగా ఉన్నాడు. అక్బరు అతన్ని



"అల్లరి వెధవ" గా పరిగణించి క్షమించే శాడు. ఆ తరవాత అక్బరు ఎంతో కాలం జీవించ లేదు; అతను 1605 అక్టోబరు 17న మరణించాడు.

అక్బరు అపూర్వ వ్యక్తి కావటానికి అనేక ప్రభావాలు దోహదం చేశాయి. తీమూర్ సంతతి వారు విజేతలే అయినప్పటికీ లలిత కళా ప్రియులు. సూఫీ తత్వ ప్రభావం వారి నలా తయారుచేసింది. అక్బరుకు అతని తల్లి పరమత సహనం అలవడ చేసింది. కాబూల్ ఆస్థానంలో ఉన్నప్పుడు అక్బరుకు అనేకమంది సూఫీ భక్తుల సంపర్కం కలిగింది. అతనికి తన రాజ

పుత్ర భార్యల ద్వారా హిందూ మత సంపర్కం కూడా కలిగింది.

వీటన్నిటికీ తోడుగా, యావద్భారతంలో మొగలు సామ్రాజ్యం స్థాపించాలన్న అతని ఆశయం కూడా అతని మతవైఖరిని కొంత వరకు నిర్ణయించింది. వివిధ మతాల మధ్య సాగిన దారుణ సంఘర్షణలు చూసి అక్బరుకు మతిపోయింది. అన్ని మతాలకూ అమోదకరంగా ఉండే మతాన్ని ప్రవచించి తన సామ్రాజ్యంలో మత సామరస్యం నెల కొల్పాలని అక్బరు కలలు కనేవాడు.

అతను ముస్లిము మతవేత్తలనే గాక, హిందూ, జైన, పార్సీ, క్రైస్తవ మత ప్రవీణులను సమావేశ పరిచి వారితో చర్చలు జరిపాడు. అతను అన్ని మతాలలోనూ ఎంతో మంచి చూశాడు, కాని ఏ మతాన్నీ స్వీకరించలేదు; "దీని ఇలాహీ" అనే ఒక కొత్త మతాన్ని ప్రచారం చేశాడు. అందులో ఇస్లాము, హిందూ, క్రైస్తవ మతాంశలుండేవి. అతను ఈ మతాన్ని బలాత్కారంగా ఎవరికీ అంటగట్టలేదు. అయితే అతను ముస్లిము మత గురువులను మాత్రం పూర్తిగా నిగ్రహంలో ఉంచి, వారి ఆటలు సాగకుండా చేశాడు. అక్బరు మత దృష్టి జాతీయాదర్శ చిహ్న మనాలి.

భారత చరిత్రలో అక్బరుకు ప్రముఖ స్థానం ఇచ్చినవి అతని వ్యక్తిగతమైన గుణాలు—యుద్ధ కౌశలమూ, ఉదార స్వభావమూ, న్యాయ పరిపాలనా, సంస్కారమూ, పరేంగితజ్ఞతా మొదలైనవి. "ఆయన సాధారణ వ్యక్తి కాదు, దేవాంశ గలవాడు," అని జహంగీర్ తన తండ్రిని గురించి అన్నాడు. అక్బరు అమితమైన ధైర్యమూ, శరీర బలమూ గలవాడు. యుద్ధంలోగాని, వేటలోగాని అతను భయపడి ఎరగడు. అతని వర్తనా, సంభాషణా ఎంతో ఇంపుగా ఉండి, అవతలి వాళ్ళను బలంగా ఆకర్షించేవి.



# నేహ్రూ కథ

## 12



రామచంద్ర మహారాష్ట్రుడు. అతను కొంత కాలం ఫిజీలో శ్రామికుడుగా పనిచేసి వచ్చి అయోధ్య రాష్ట్రంలో స్థిరపడ్డాడు. అతను గ్రామాల వెంట తిరుగుతూ తులసీదాసు రామాయణం లోని దోహాలను చదువుతూ రైతుల కష్టాలను గురించి శ్రద్ధగా వినేవాడు. అయోధ్య లోని ఫైజబాద్, బరేలీ, ప్రతాప్ గర్ జిల్లాలలో సీతారాముల గాథలు జన ప్రియమైనవి; తులసీ రామాయణం అంద రికీ తెలుసు. అందులో నుంచి వాక్యాలు ఏరి ఉదహరించేవాడు రామచంద్ర. అతనికి చెప్పుకో దగిన చదువేమీ లేకపోయినా రైతు లను తరచు సమావేశ పరిచి, సభలు పెట్టించి, వారిలో సంఘీభావం పెంపొందింప జేశాడు. "సీతారాం" అన్న కేక కొత్తది కాకపోయినా, దాని నొక నినాదం లాంటిదిగా తయారుచేసి, దాని ద్వారా గ్రామాలను సంఘటిత పరిచాడు.

ఇలా సంఘటిత పడిన కిసానులకు అతను అస్పష్టమైన వాగ్దానాలు చేసి వారిలో ఆశలు రేకెత్తించాడే గాని, వారి కొక కార్య క్రమం అందించలేకపోయాడు. తీరా కిసానులు ఉత్తేజితు లయేసరికి వారిని నడి పించే భారం ఇతరుల పైన పెట్టగోరి, వారి చేత అలహాబాదుకు యాత్ర చేయించి, తమ ఉద్యమాన్ని అక్కడ ప్రచారం చేశాడు.

అటు పిమ్మట మరొక సంవత్సరం పాటు రామచంద్ర కిసాను ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించి, రెండు మూడు సార్లు జైలు కూడా వెళ్ళాడు. తరవాత అతను బాధ్యతా రహితంగానూ, నమ్మదగని వాడు గానూ వ్యవహరించి వైదొలగాడు.

కిసాను ఉద్యమానికి అయోధ్య సరి అయిన క్షేత్రం. అది "తాలూకాదార్ల"



కాణాచి. అక్కడి జమీందారీ వ్యవస్థ అత్యంత హేయంగా ఉంటూ వచ్చింది. భూస్వాముల దోపిడీ దుర్భర ప్రమాణాల నందుకున్నది. భూవసతి లేని రైతుకూలీల సంఖ్య నానాటికీ పెరిగిపోతున్నది. కౌలు దార్లందరూ ఒకే వర్గానికి చెందినవారు కావటం చేత ఐక్య ప్రతిఘటనకు అవకాశం చిక్కింది.

"స్థూలంగా భారతదేశాన్ని రెండు విభాగాలుగా చెయ్యవచ్చు. బెంగాలూ, బిహారూ, ఆగ్రా-అయోధ్య సంయుక్త రాష్ట్రాలూ జమీందారీ ప్రాంతాలు. మిగిలినవి భూవసతి గల వ్యవసాయదారులుండే ప్రాంతాలు. ఈ రైతు ప్రాంతాలలో కూడా పరిస్థితి ఘోరమే అయినా, జమీందారీ ప్రాంతాల ఉన్నంత ఘోరం కాదు. ఇతర జమీందారీలలో కౌలుదార్లలో రకాలున్నాయి, కాని అయోధ్యలో అంతా ఒకే రకం—అందరూ సాలు కౌలు వాళ్ళే. భూమిని సాగు చేసే అధికారం మక్తా హెచ్చుగా ఇచ్చేవారికి మార్పు చెందుతూం డేది. అందుచేత ఇక్కడి కిసానులను సంఘటిత పరచటం తేలిక అయింది," అని జవాహర్ తన ఆత్మకథలో చెప్పాడు.

ఉన్న కౌళ్ళకైనా ప్రాణం ఉండేదికాదు. పొలం చేసేవాడు భూస్వామికి సొమ్ము కట్టినా కూడా దానికి రసీదూ, సాక్ష్యమూ ఉండేదికాదు. సొమ్ము కట్టలేదని భూస్వామి కౌలుదారును భూమి నుంచి తొలగిస్తే చెప్పుకోవటానికి దిక్కుండేది కాదు. ఇది ఇలా ఉండగా అసంఖ్యాకమైన అక్రమ వసూళ్ళుండేవి. గవర్నరుకు విందు చెయ్యాలి—వసూలు; ఒక కారు కొనాలి—వసూలు; ఒక ఏనుగు కొనాలి—వసూలు. ఈ వసూళ్ళకు అంతూ పొంతూ ఉండేది కాదు. ఒక తాలూకాలో యాభై రకాల అక్రమ వసూళ్ళుండినట్టు కూడా జవాహర్ విన్నాడు!



ఇలాటి పరిస్థితిలో అయోధ్యలో కిసాను ఉద్యమం భారీ ఎత్తున సాగింది. ఈ ఉద్యమం దానంతట అదే ఉద్భవించటం జవాహరును ఆశ్చర్యపరిచింది. దానికొక నాయకుడు లేడు; కాంగ్రెసుతోగానీ, కాంగ్రెసు సాగించిన సహాయనిరాకరణోద్యమంతో గానీ దానికి ఎలాటి సంబంధమూ లేదు. ఏ రాజకీయవాదీ దాన్ని ప్రేరేపించ లేదు, నిరోధించ లేదు. ఈ రెండు ఉద్యమాలూ ఒకే గడ్డ నుంచి స్వతంత్రంగా మొలకెత్తాయని మటుకుచెప్పవచ్చు. వ్యవసాయదార్లకు గాంధీజీ పేరు తెలియక పోలేదు. ఆయన **1919** లో ప్రారంభించిన హర్తాలులలో వారు కూడా పాల్గొన్నారు.

అయితే ఈ కిసాను ఉద్యమం గురించి నగరాల వారికి మటుకు ఏమీ తెలియదు. దాన్ని గురించి పత్రికలలో ఒక్క వాక్యమైనా ఉండేది కాదు. ఇది జవాహరును మరింత ఆశ్చర్యపరిచింది. "మేము ప్రజలకు ఎంత దూరమైపోయి, ఎలాటి సంకుచిత రంగంలో మా ఆందోళనను సాగిస్తున్నామో నాకు తెలియవచ్చింది," అన్నా డతను.

జవాహర్ మూడు రోజులపాటు గ్రామాలు పర్యటించి అలహాబాదుకు తిరిగి వచ్చాడు. అటుపైన అతను తరచు గ్రామా



లకు వెళ్ళిరాసాగాడు. అతను కారులో వస్తూండటం చూసి గ్రామస్థులు కారు కోసం, రోడ్లు లేని చోట రోడ్లు కూడా అప్పటి కప్పుడు వేసేవారు. జవాహర్ బృందం వెంట అస్తమానమూ, పోలీసులూ, సిఐడీలూ, లక్నో డిప్టీకలెక్టరూ ఉండేవారు. జవాహరుతో బాటు కాలినడకన తిరగలేక వాళ్ళకు ప్రాణాలు పోతూండేవి.

అప్పటి దాకా జవాహరు పదిమంది ఎదట లేచి మాట్లాడాలంటే చాలా బిడియ పడేవాడు. గ్రామస్తు లతని బిడియాన్ని పోగొట్టేశారు. హిందూస్థానీలో మాట్లాడటం అతనకి పట్టిచ్చినట్టుండేది. అది కూడా



పోయింది. అతను పది మంది ఎదటా, పది వేలమంది ఎదటా కూడా ప్రసంగించటం నేర్చుకున్నాడు. అతను ఉపన్యాసాలు చెయ్యలేదు. పేద అమాయక ప్రజానీకం ఎదట ఉపన్యసించటంలో అర్థమేముంటుంది? అతను తన ప్రేక్షకులతో సంభాషించే విద్య అలవరుచుకున్నాడు. ఎన్ని లక్షలమందితో నైనా ఆత్మీయంగా ప్రసంగించటం జవాహరు మీటింగుల ప్రత్యేకతగా చివరిదాకా నిలబడిపోయింది. అతని కంఠం దూరం వినిపించేది కాదు. అప్పుడా కుగ్రామాలలో లౌడ్‌స్పీకర్లు లేవు. చాలా మంది కిసానులు అతను చెప్పే మాటలు వినగలిగేవారు కారు. విన్న వారికి అవి ఎంత వరకు అర్థమయేవో చెప్పటం కష్టం. కాని మీటింగులో కూర్చున్న వారందరికీ అతని పైన పరిపూర్ణమైన విశ్వాసముండేది.

క్రమంగా కిసాను ఉద్యమం బలపడటం జవాహర్ స్వయంగా చూశాడు. అతను తరచుగా గ్రామాలకు వెళ్ళివస్తూండేవాడు. కిసానులు పూర్వం కన్న చాలా ధైర్యంగా ఉంటున్నారు. జమీందార్ల ఏజెంట్ల జులుమూ, అక్రమ వసూళ్ళూ తగ్గాయి. గాంధీజీ సత్యాగ్రహోద్యమ ప్రభావం గ్రామ గ్రామానికీ పాకింది. కాంగ్రెసు కార్యకర్తలు తమ ప్రచారంలో "కిసానుల కష్టాలు తొలగించటం" అనే దాన్ని కూడా జాతీయోద్యమం యొక్క ఆశయాలలో చేర్చి ఉపన్యాసా లిస్తున్నారు. "స్వరాజ్యం" అన్న మాటలో అందరి ఆశయాలూ ఇమిడి ఉంటున్నాయి.

జాతీయోద్యమమూ, కిసాను ఉద్యమమూ కలిసే కొనసాగాయి, రెంటికీ సజీవ సంబంధా లున్నాయి. అయినప్పటికీ అవి రెండు ప్రత్యేక ఉద్యమాలే. గాంధీజీ ఉద్యమం ప్రభావం వల్లనే కిసానులు అహింసా విధానాన్ని అవలంబించి తమ ఉద్యమాన్ని నడిపారు.






## 13

కతలూఖాన్ విలాస భవనంలో ఇంకా నృత్య గానాలు జరుగుతూనే ఉన్నాయి. ఎవతో పాడుతున్నది, ఎవతో నాట్యం చేస్తున్నది, చాలా మంది స్త్రీలు తాళం వేస్తున్నారు. ఆనందోత్సవం పరాకాష్ఠ నందుకున్నది. కతలూఖాన్ పూర్తిగా మైకంలో ఉండి, "సాకీ, సాకీ!" అంటున్నాడు; అన్నప్పుడల్లా విమల అతనికి మద్యం అందిస్తున్నది. తాగిన కొద్దీ నవాబు మైకం హెచ్చుతున్నది.

విమల నృత్యం చెయ్యసాగింది. నవాబు ఆ నృత్యం చూసి ఆమెను దగ్గిరికి పిలిచాడు. ఆమె వచ్చి అతని సమీపంగా నిలబడింది. అత నామెను తన పక్కన కూర్చోమన్నాడు. "వస్తున్నాను," అంటూ విమల చప్పున చెయ్యి పైకెత్తింది. ఆమె చేతిలో కత్తి జిగేలున మెరిసింది.

కతలూఖాన్ పెట్టిన చావు కేక రాజభవనమంతా మారుమోగింది. అతను విమలను బలంగా నెట్టివేస్తూ, అదే సమయంలో తాను కూడా పడిపోయాడు. ఆ సమయంలో విమల అతని వక్షంలో కత్తిని గుచ్చేసింది. ఆమె భర్త దుర్మరణానికి ప్రతీకారం జరిగిపోయింది.

"సైతాన్! హంతకీ!" అని కతలూఖాన్ అరిచాడు. అక్కడ ఉన్న స్త్రీలు కొందరు భయంతో వణికిపోతూ కెవ్వున అరవ నారంభించారు. విమల కూడా కెవ్వున కేకలు

బంకించంద్ర చట్టోపాధ్యాయ





అక్కడ మటుకు ఒక కాపలావాడు పహరా ఇస్తున్నాడు. వాడు విమలను చూసి, "ఎవరు నువ్వు? ఎక్కడికి పోతున్నావు?" అన్నాడు.

అప్పటికి అంతఃపురంలో మహా పెద్ద కోలాహలంగా ఉంది. అన్ని ప్రాంతాల నుంచీ జనం అటు కేసి పరిగెత్తుతున్నారు. విమల పహరావాడితో, "ఇక్కడ ఉండి నువేం చేస్తున్నావు? ఆ గోల వినపడటం లేదూ? పద, వెళ్ళి రక్షించు!" అన్నది.

"ఏమిటి? ఏమయింది?"

"కోటలో మొగలులు జొరబడ్డారు. నవాబు ప్రాణాలు రక్షించు!"

కోటగుమ్మం వద్ద ఉన్నవాడు కూడా లోపలికి పరిగెత్తాడు. విమల నిశ్చింతగా బయటికి వెళ్ళిపోయింది. ముఖద్వారం దాటి కొంత దూరం వెళ్ళేసరికి ఆమె కొక చెట్టు కింద ఒక మనిషి నిలిచి ఉండటం కనబడింది. ఆమె అభిరామస్వామిని గుర్తించింది.

ఆయన విమలను చూస్తూనే, "నేను చాలా కంగారు పడ్డాను. కోటలో ఆ కోలాహల మేమిటి?" అన్నాడు.

"ఏమీలేదు. నా వైధవ్యానికి ప్రతిక్రియ చేశాను. ఇక ఇక్కడ మసలరాదు, త్వరగా

పెడుతూ పరిగెత్తసాగింది. ద్వారం వద్ద ఉన్న కొజ్జా కాపలావాళ్ళు విమల కంగారు చూసి, "ఏం జరిగింది?" అని అడిగారు.

నిశిత బుద్ధి గల విమల, "సర్వనాశనం! అంతఃపురంలో మొగలులు జొరబడ్డారు, త్వరగా వెళ్ళండి! వాళ్ళు నవాబు నేం చేస్తారో?" అన్నది. కొజ్జా వాళ్ళంతా ఒక్కుమ్మడిగా అంతఃపురం లోకి అతి వేగంగా పరిగెత్తారు. విమల అంతఃపుర బహిర్ద్వారం వద్దకు చేరుకునే సరికి అక్కడి పహరా వాళ్ళంతా తప్పతాగి నిద్ర పోతున్నారు. ఆమె సునాయాసంగా కోట ద్వారాన్ని చేరుకున్నది.





ఆశ్రమానికి వెళ్ళిపోవాలి. తరవాత సంగ తంతా చెబుతాను. తిలోత్తమ ఆశ్రమానికి చేరుకున్నది గద?" అన్నది విమల.

"తిలోత్తమ అస్మానీ వెంట ముందు నడుస్తున్నది. నీవు వాళ్ళను త్వరలోనే కలుసుకుంటావు."

ఇద్దరూ చురుకుగా నడుస్తూ త్వరలోనే ఆశ్రమాన్ని చేరుకున్నారు. వారి కన్న కొంచెం ముందుగా తిలోత్తమ అస్మానీ వెంట వచ్చి చేరింది.

"ఈశ్వరానుగ్రహం వల్ల మీ రంతా దుర్మార్గుల బారి నుండి బయటపడ్డారు. ఇక ఇక్కడ ఒక్క క్షణం కూడా ఉండ రాదు. ముసల్మానులకు ఆచూకీ దొరికితే మనని ప్రాణాలతో వదలరు. ఈ రాత్రే మనం ఇక్కడి నుంచి వెళ్ళిపోవాలి," అన్నాడు అభిరామస్వామి......

విమల నవాబును గుండెల్లో పొడిచి పారిపోయిన కొద్ది సేపటికే ఒక రాజోద్యోగి గాభరాపడుతూ కారాగృహానికి వచ్చి జగత సింహుడితో, "యువరాజా, నవాబు చావు బతుకుల్లో ఉన్నారు. మిమ్మల్ని రమ్మంటు న్నారు, త్వరగా రావాలి," అన్నాడు.

జగతసింహుడు నివ్వెరపోయి, "ఏమి టయింది?" అన్నాడు.



"ఎవరో శత్రువు అంతఃపురంలో ప్రవే శించి, నవాబును పొడిచి పారిపోయాడు. ఆయన వెంటనే చావలేదు గాని, మృత్యువు దగ్గరలోనే ఉన్నది. త్వరగా వెళ్ళకపోతే మించిపోవచ్చు," అన్నాడు ఉద్యోగి.

జగతసింహుడు వెంటనే బయలుదేరి వెళ్ళి, అవసాన దశలో ఉన్న కతలూఖాన్‌ను చూశాడు. ఉస్మాన్, అయుషా, నవాబు సంతానమూ, భార్యలూ, ఉంపుడుగత్తెలూ, మంత్రులూ, ఇతర అధికారులూ నవాబు చుట్టూ చేరి ఉన్నారు. అయుషా తండ్రి తల తన ఒడిలో పెట్టుకుని, నిశ్శబ్దంగా అశ్రువులు రాల్చుతున్నది.



జగతసింహుడు వస్తుండగానే ఖ్వాజా ఈసా అనే మంత్రి అతన్ని చెయ్యి పట్టుకుని నవాబు సమీపానికి తీసుకువెళ్ళి, గట్టిగా, "యువరాజు జగతసింహ వచ్చారు!" అని చెప్పాడు.

కతలూఖాన్ హీనస్వరంతో, "నేను శత్రువును. చనిపోతున్నాను. ఇప్పుడు నాకు విరోధ భావం లేదు," అన్నాడు.

"నాకూ లేదు," అన్నాడు జగతసింహుడు.

"పిల్లలు పసివాళ్ళు...యుద్ధం వద్దు... సంధి..."అన్నాడు నవాబు. ఆయన దాహం అంటే ఆయషా ఆయన నోట షర్బత్ పోసింది. నవాబు జగతసింహుడి కేసి ఆశగా చూసి, అత నేమీ అనకపోయే సరికి, "సమ్మతం కాదా?" అన్నాడు.

"పఠానులు పాదుషా ఆధిపత్యానికి సమ్మతిస్తే నేను సంధియత్నం చెయ్యగలను," అన్నాడు జగతసింహుడు.

నవాబు తలాడిస్తూ, అస్పష్టంగా, "ఒరిస్సా?" అన్నాడు.

"నా ప్రయత్నం సానుకూలమైతే మీ సంతతికి ఒరిస్సా దక్కుతుంది," అన్నాడు జగతసింహుడు.

మరణ యాతనలో కూడా నవాబు ముఖం వికసించింది; "మీకు...స్వేచ్ఛ...



దేవుడు...మీకు...శుభం... కలిగించాలి," అన్నాడాయన.

జగతసింహుడు వెళ్ళిపోతూండగా ఆయుషా వంగి తన తండ్రి చెవిలో ఏదో చెప్పింది. నవాబు సంజ్ఞ గ్రహించి ఖ్వాజా ఈసా అతని వెనక వెళ్ళి, "నవాబు మీ కింకేదో చెబుతారల్లే ఉంది," అని పిలుచుకు వచ్చాడు.

పక్కన కూర్చున్న జగతసింహుడితో "చెవిలో," అన్నాడు నవాబు. ఆయన రహస్యం చెప్ప దలిచినట్టు గ్రహించి చెవి ఒగ్గాడు జగతసింహుడు. నవాబు అతి కష్టం మీద, మధ్య మధ్య "దాహం" అంటూ, ఒక్కొక్క మాటగా, తిలోత్తమను తండ్రి లేని దాన్నిగా చేసి తాను పాపం కట్టుకున్నాననీ, ఆమె నిష్కలంక అనీ చెప్పి, ఆయుషా పేరు ఉచ్చరిస్తూ ప్రాణాలు వదిలాడు.

జగతసింహుడు కారాగార విముక్తి పొంది, తన తండ్రి ఉండే సైనిక శిబిరానికి వెళ్ళి, మొగలులకూ పఠానులకూ సంధి కుదిర్చాడు. ఒరిస్సాలో వారు స్వేచ్ఛగా పరిపాలన సాగించుకుంటూ, పాదుషా ఆధిపత్యాన్ని శిరసావహించేటట్టుగా సంధి జరిగింది. ఉభయపక్షాలవారూ ఒకరి కొకరు పరిహారం చెల్లించుకున్నారు. ఇదంతా జరగటానికి కొంత కాలం పట్టింది.







వద్ద అతనికి ఉస్మాన్ కనిపించి, అతనితో బాటు నడవసాగాడు.

"సేనాపతీ, మీ రేదైనా కోరినట్టయితే ఆజ్ఞాపించండి," అన్నాడు జగతసింహుడు ఎంతో గౌరవంగా.

"మీ పరివారాన్ని ముందు బయలు దేరి వెళ్ళనివ్వండి. ఆ తరవాత మీతో ఏకాంతంగా ఒక విషయం ముచ్చటించాలి," అన్నాడు ఉస్మాన్.

జగతసింహుడు నిస్సంకోచంగా తన పరివారాన్ని ముందు వెళ్ళనిచ్చి తాను తన గుర్రం మీద వెనక ఉండిపోయాడు. ఉస్మాన్ కూడా తన నౌకరు చేత ఒక గుర్రాన్ని తెప్పించి దానిపై ఎక్కాక, ఇద్దరూ కలిసి నడవ సాగారు.

ఉస్మాన్ ఒక దట్టమైన బూరుగు చెట్ల తోపు మధ్య ఉండే పాడుబడిన కోటకు దారి తీశాడు. ఇద్దరూ గుర్రాలు దిగి ఆ కోట ప్రవేశించారు. ఆ కోట మధ్య కొత్తగా తవ్విన గోరీ ఒకటి ఉన్నది, కాని అందులో పూడ్చే శవం మటుకు లేదు. గోరీ పక్కనే ఒక చితి పేర్చి ఉన్నది. దాని దగ్గిరా శవం లేదు.

"ఏమి టిదంతా? చిత్రంగా ఉందే!" అన్నాడు జగతసింహుడు.

మొగలు సేనలు గుడారా లెత్తి పాట్నాకు వెళ్ళిపోవటానికి సిద్ధంగా ఉన్నాయి. ఒక నాటి మధ్యాన్నం జగతసింహుడు సపరివారంగా నవాబు భవనానికి వెళ్ళి, ఉస్మాన్‌కూ, ఖ్వాజా ఈసాకూ వెళ్ళి వస్తానని చెప్పి, ఆయెషాకు వీడ్కోలు చెప్పుదామని ఆమె గది దగ్గిరికి వెళ్ళి, ఆమె దర్శనం అర్థించాడు.

"యువరాజా, క్షమించాలి. నే నిప్పుడు నిన్ను కలుసుకోలేను," అని ఆయెషా అంటున్నట్టుగా కొజ్జావాడు అతనితో చెప్పాడు. జగతసింహుడు హతాశుడై తన శిబిరానికి బయలుదేరాడు. కోట ద్వారం



"ఈ ఏర్పాటు నేనే చేయించాను. నేను చచ్చిపోతే ఈ గోరీలో పూడ్చెయ్యి. నువు చచ్చిపోతే ఈ చితి పైన దహనం జరిపిస్తాను," అన్నాడు ఉస్మాన్.

"అంటే?"

"మనలో ఎవరో ఒకరు చావాలి. ఆయిషా ప్రేమను కోరినవా రిద్దరు ఈ ప్రపంచంలో జీవించి ఉండటానికి వీల్లేదు," అన్నాడు ఉస్మాన్.

ఈ మాట అంటూనే ఉస్మాన్ కత్తి దూసి జగతసింహుడి పై కలియబడ్డాడు. విధిలేక జగతసింహుడు తన ఒర నుంచి కత్తి తీసి, ఉస్మాన్ దెబ్బలను అడ్డుకుంటూ ఆత్మ రక్షణ చేసుకోసాగాడు. ఇద్దరూ మంచి యోధులే. కాని జగతసింహుడి శరీరం పైన చాలా గాయాలు తగిలి, రక్తం స్రవిస్తున్నది. అతను ఉస్మాన్‌ను గాయపరచటానికి యత్నించక పోవటం చేత ఉస్మాన్ శరీరం పైన ఒక్క గాయం కూడా లేదు.

ఇలా యుద్ధం చేస్తూ పోతే తనకు చావు తప్ప దనుకుని జగతసింహుడు, "ఉస్మాన్, ఇంక చాలించు. నేనే ఓడిపోయినట్టు ఒప్పుకుంటాను," అన్నాడు.

ఉస్మాన్ పెద్దపెట్టున నవ్వి, "రాజపుత్రుడి కింత ప్రాణభయం ఉంటుందని



తెలీదు. యుద్ధం చెయ్యి. నిన్ను చంపేస్తాను. ఒకవేళ నేనే చచ్చినా నీకు మాత్రం ఆయిషా దక్కదు," అన్నాడు.

"నాకు ఆయిషా అవసరం లేదు. నే నామెను కోరటం లేదు," అన్నాడు జగతసింహుడు.

"నువు ఆయిషాను కోరకపోయినా ఆయిషా నిన్ను ప్రేమిస్తున్నది, కోరుతున్నది. యుద్ధం చెయ్యి," అంటూ ఉస్మాన్ కత్తి తిప్పాడు. జగతసింహుడు కత్తి అవతల పారేసి, "ఆపత్కాలంలో కాపాడి నాకు ప్రాణ దానం చేశావు. నేను నీతో యుద్ధం చెయ్యను," అన్నాడు.

ఉస్మాన్ కోపావేశంతో అతన్ని కాలితో తన్ని, "యుద్ధం చెయ్యటానికి భయపడుతున్నావా? ఏమన్న యోధుడివి?" అన్నాడు ఈసడిస్తూ.

జగతసింహుడికి ఓర్పు నశించి ఆవేశం వచ్చింది. అతను కింద పడిన తన కత్తిని తీసుకుని ఉస్మాన్ పైకి లంఘించాడు. అతని దెబ్బలకు ఉస్మాన్ ఉక్కిరి బిక్కిరి అయి కింద పడిపోయాడు. జగతసింహు డతని రొమ్ము మీద ఎక్కి కూర్చుని, అతని కత్తి లాగేసి ఉస్మాన్ కంఠం మీద నొక్కిపెట్టి, "ఏం? ఇప్పటికైనా యుద్ధదాహం తీరిందా?" అన్నాడు.

"నా ఒంట్లో ప్రాణం ఉండగా తగ్గదు," అన్నాడు ఉస్మాన్.

"నీ ప్రాణాలు తియ్యటానికి క్షణం పట్టదు, తెలుసా?"

"చంపెయ్యి. లేకపోతే నిన్ను చంపే యత్నం మానను."

"బతికే ఉండు. నాకు నీ భయం లేదు. ఒకనాడు నా ప్రాణాలు కాపాడావు. ఇప్పుడు నీ ప్రాణాలు కాపాడుతాను."

జగతసింహుడు ఉస్మాన్ రెండు చేతులనూ తన కాళ్ళతో తొక్కిపట్టి, అతని వద్ద ఉన్న ఆయుధాలన్నీ లాగేసుకుని, తరవాత అతన్ని విడిచిపెట్టాడు. "పో, వెళ్ళిపో. నన్ను కాలితో తన్నావు. లేకపోతే నీ కింత అవమానం చేసి ఉండను," అన్నా డతను.

ఉస్మాన్ గుర్రం ఎక్కి తమ కోట వేపు వెళ్ళిపోయాడు.

జగతసింహుడు బావి దగ్గిర తన గాయాలన్నీ కడుక్కుని తన గుర్రం దగ్గిరికి వచ్చేసరికి గుర్రం మెడకు ఒక ఉత్తరం కట్టి ఉన్నది. దాని పైన, "రెండు రోజుల దాకా చదవ వద్దు," అని ఉండటం చేత అతనా ఉత్తరాన్ని తన కవచంలో దాచుకుని తమ శిబిరానికి వెళ్ళాడు.

—(వచ్చే సంచికలో ముగింపు)






# నరక భయం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు మీద నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీవు పడుతున్న ఈ శ్రమకు ఫలితంగా నరక ప్రాప్తి కలుగుతుందేమో ఆలోచించి చూసుకున్నావా? మానవులకు నరక భయాన్ని మించిన భయం లేదు కదా! అది నిరూపించటాని కొక కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

ఒకప్పుడు సింహళ ద్వీపంలో సింహ విక్రముడనే గజదొంగ ఉండే వాడు. వాడు బుద్ధి తెలిసినప్పటి నుంచీ ఇతరుల సొత్తు దోచి, ధనికుడై సుఖ జీవనం గడిపాడు. అటువంటి వాడికి వార్ధక్యం సమీపించింది.

అప్పుడు వాడి కొక చింత పట్టుకున్నది. వాడిలాగ అనుకున్నాడు: "ఈ లోకంలో

## బేతాళ కథలు



తప్పించుకున్నాను. కాని చచ్చాక నాకు నరకం తప్పదు. ఈ జన్మలో కొంచెమైనా పుణ్యం చెయ్యని నన్ను నరకం నుంచి ఏ దేవుడు కాపాడగలడు? దేవుళ్ళకు దిక్పాలకు లైన దేవతలు భక్తులుగా ఉంటారు. అందుచేత శివుడుగాని, విష్ణువుగాని దేవతలను కాదని నా మొర ఆలకించరు. భూలోక వాసుల అందరి పాప పుణ్యాలూ లెక్కలు వేసే చిత్రగుప్తుడే నాకేదైనా సహాయం చెయ్యాలి."

ఈ విధంగా అనుకుని సింహవిక్రముడు నిత్యమూ భక్తి శ్రద్ధలతో చిత్రగుప్తుణ్ణి అర్చించ సాగాడు; చిత్రగుప్తుడి ప్రీత్యర్థం బ్రాహ్మణ సంతర్పణలు చేయ నారంభించాడు. భోజనం చేసిన బ్రాహ్మణులను, "చిత్రగుప్తుడి అనుగ్రహం కలుగుగాక!" అని తనను దీవించ మనేవాడు.

ఒకనాడు చిత్రగుప్తుడే బ్రాహ్మణ వేషం ధరించి సింహవిక్రముడి ఇంటికి అతిథిగా వచ్చాడు. దొంగవాడు ఆయనకు చక్కగా అతిథి సత్కారాలు జరిపి, భోజనం పెట్టి, గొప్పగా దక్షిణ యిచ్చి, "నన్ను చిత్రగుప్తుడనుగ్రహించాలని ఆశీర్వదించండి," అని కోరాడు.

చిత్రగుప్తుడు వాడితో, "ఇదేమి ఆశీర్వచనం? శివకేశవులను కూడా విడిచి చిత్రగుప్తుణ్ణి ఆరాధిస్తున్నావేమిటి?" అన్నాడు.

"అదంతా మీ కెందుకు? నాకు చిత్రగుప్తుడి అనుగ్రహం తప్ప మరే దేవత అనుగ్రహమూ అవసరం లేదు," అన్నాడు దొంగవాడు.

ఈ మాటకు చిత్రగుప్తుడు సంతోషించి, తన నిజ రూపంతో దొంగవాడికి ప్రత్యక్షమై, "నీ భక్తికి మెచ్చాను. నీ కేం కావాలో చెప్పు," అన్నాడు.

సింహవిక్రముడు పరమానంద భరితుడై, "స్వామీ, నాకు చావు రాకుండా ఉపాయం చెప్పండి," అన్నాడు.

"అది అసాధ్యమైన సంగతి. అయినా నీ కొక్క ఉపాయం చెబుతాను. ఒకప్పుడు శ్వేతముని ప్రాణాలు తీయటానికి యముడు రాగా శివు డాగ్రహించి, యముణ్ణి కాల్చి భస్మం చేశాడు. శివుడు తరవాత యముణ్ణి తిరిగి బతికిస్తూ, శ్వేతముని ఉండే చోట ఏ ప్రాణినీ అంట వద్దని ఆజ్ఞాపించాడు. సముద్రం అవతల తరంగిణీ నది అవతలి ఒడ్డున శ్వేతముని ఆశ్రమం నిర్మించుకుని ఉంటున్నాడు. ఆ తపోవనంలోకి యముడు గాని, యమ కింకరులు గాని రారు. నిన్నక్కడ దిగవిడుస్తాను. నీవు మాత్రం ఏ పరిస్థితుల్లోనూ ఆ నది దాటి ఇవతలి ఒడ్డుకు రాకు," అని చెప్పి, చిత్రగుప్తుడు సింహవిక్రముణ్ణి తరంగిణీ నది అవతలి ఒడ్డున, శ్వేతముని ఆశ్రమంలో వదిలి అదృశ్యుడయాడు.

కొంతకాలం గడిచాక యముడు దొంగ వాడి ప్రాణాలు తీసుకుపోవటానికి తరంగిణీ నది ఇవతలి ఒడ్డుకు చేరాడు. తాను నది దాటి అవతలి ఒడ్డుకు పోవటానికి లేదు గనక, యముడు తన మాయా ప్రభావంతో ఒక దివ్య స్త్రీని సృష్టించి, శ్వేతముని ఆశ్రమానికి పంపాడు.

ఆ స్త్రీని చూసి దొంగ మోహితుడై ఆమెతో కొంత కాలం సుఖించాడు. ఆ తర





వాత ఆమె తన వాళ్ళను చూడటానికి నది దాటి వెళ్ళి మళ్ళీ వస్తానని బయలుదేరింది. దొంగవాడు ఆమెను నది ఒడ్డు దాకా సాగనంపి ఆమె నది దాటటం చూస్తూ అక్కడే నిలబడ్డాడు.

సగం నది దాటి ఆమె ప్రవాహ వేగానికి కొట్టుకు పోతున్నట్టు నటిస్తూ, "అయ్యో, మునిగి పోతున్నాను. కాపాడు! అలా చూస్తూ నిలబడిపోతావేం? రక్షించు!" అని కేకలు పెట్టింది.

ఆ కేక వింటూనే దొంగ నదిలోకి దూకి ఆమె పోతున్న దిక్కుగా ఈద నారంభించాడు. అతను ఆమెను చేరుకునే సరికి ఆమె అవతలి ఒడ్డు చేరనే చేరింది. దొంగ అవతలి ఒడ్డున కాలు పెట్టగానే యముడు దొంగ మెడకు పాశం తగిలించి తన లోకానికి తీసుకుపోయాడు.

ఈ విధంగా సింహవిక్రముడు చావు తప్పించుకోలేక పోయాడు. అయినప్పటికీ చిత్రగుప్తుడు వాడికి మరొక సలహా రహస్యంగా చెప్పాడు: "యముడు నిన్ను, ముందు స్వర్గ మనుభవిస్తావా, నరక మనుభవిస్తావా? అని అడుగుతాడు. స్వర్గమే అనుభవిస్తా నని చెప్పు. నిన్ను స్వర్గానికి పంపుతారు. అక్కడ నీవు స్వర్గ సుఖా లనుభవిస్తూ కూర్చోక, నీ పాప మంతా పరిహార మయేదాకా తపస్సు చెయ్యి."

సింహవిక్రము డలాగే చేస్తా నన్నాడు.

తరవాత యమధర్మరాజు చిత్రగుప్తుణ్ణి పిలిచి, "ఈ దొంగకు పుణ్యఫల మేమైనా ఉన్నదా?" అని అడిగాడు.

"ఉన్నది, దేవా. ఇతను బ్రాహ్మణ సంతర్పణలు చేసి ఒక దేవతాదినం పాటు స్వర్గ వాసం చేసేపాటి పుణ్యం సంపాదించాడు," అన్నాడు చిత్రగుప్తుడు.

"ఏమోయ్, నీకు ముందు స్వర్గం కావాలా, నరకం కావాలా?" అని యముడు దొంగ నడిగాడు.

"దేవా, నేను ముందు స్వర్గానికే పోతాను," అన్నాడు దొంగ.

సింహవిక్రముణ్ణి స్వర్గానికి పంపారు. వా డక్కడ సుఖా లనుభవించే ఉద్దేశం పెట్టుకోక, శివుణ్ణి గురించి తీవ్రమైన తపస్సు చేసి, తన పాపా లన్నిటినీ భస్మం చేసేసుకున్నాడు. అతడి స్వర్గవాసం పూర్తి కాగానే అతణ్ణి నరకానికి తీసుకుపోవటానికి వచ్చిన యమకింకరులు, అతన్ని తేరి చూడటానికి కూడా శక్తి చాలక, వచ్చిన దారే తిరిగి వెళ్ళారు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. సింహవిక్రముడు శ్వేతముని ఆశ్రమంలో ఉండగా యముడు పంపిన మాయా స్త్రీ వ్యామోహంలో పడనట్టయితే చావును జయించి ఉండేవాడూ, ఘోర తపస్సు చేయవలిసిన అవసరం ఉండేది కాదూ గద. క్షుద్రమైన స్త్రీ సుఖం కోసం ఒక దివ్యమైన దినం పాటు స్వర్గభోగాలు లేకుండా ఆ దొంగ ఎందుకు చేసుకున్నాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సుఖభ్రాంతే నరక భయానికి మూలకారణం. ఈ విషయంలో హీన సుఖాలూ, ఉత్తమ సుఖాలూ అన్న వ్యత్యాసం ఏమీ లేదు. సింహవిక్రముడు శ్వేతముని ఆశ్రమంలో ఉంటూ మాయా స్త్రీ భ్రాంతితో ప్రాణం మీదికి తెచ్చుకుని, నరకానికి దగ్గిర పడ్డాడు. అలాటి భ్రాంతే అతనికి స్వర్గ సుఖాల మీద కూడా ఉండినట్టయితే తప్పక నరక ప్రాప్తి పొంది ఉండేవాడే. సుఖభ్రాంతి పోయిన క్షణంలో అతనికి నరక భయం కూడా పోయింది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# దేవస్మిత కథ

తామ్రలిప్తి నగరంలో ధనదత్తు డనే మహా ధనవంతుడైన వర్తకు డుండేవాడు. ఆయనకు లేక లేక గుహసేను డనే కొడుకు కలిగాడు. గుహసేనుడికి పెళ్ళి యీడు రాగానే ధనదత్తుడు అతని కోసం తగిన పిల్లను వెతకటం ప్రారంభించాడు. దరిదాపుల్లో ఎక్కడా తనకు నచ్చిన కన్య కనబడనందున ఆయన వర్తకం మిష మీద తన కొడుకును వెంట బెట్టుకుని ద్వీపాంతరాలకు కూడా వెళ్ళాడు.

చివరకు ఒక ద్వీపంలో ఆయనకు నచ్చిన కన్య కనపడింది. ఆ పిల్ల పేరు దేవస్మిత. ఆమె తండ్రి ధర్మగుప్త డనే వైశ్యుడు. ధనదత్తుడు ధర్మగుప్తుణ్ణి, "మీ అమ్మాయిని మా గుహసేనుడి కిచ్చి పెళ్ళి చెయ్యండి," అని అడిగాడు.

అయితే ధర్మగుప్తుడికి తన కుమార్తె అంటే ప్రాణం. తామ్రలిప్తి చూడబోతే ఎక్కడో దూర దేశాన వున్న నగరం. తన కుమార్తెను అంత దూరం ఇవ్వటం ఇష్టం లేక ధర్మగుప్తుడు ధనదత్తుడి కోరికను తోసిపుచ్చాడు.

కాని దేవస్మిత మాత్రం గుహసేనుణ్ణి చూసింది, అతని గుణాలను గ్రహించింది; అన్ని విధాలా అతన్ని ప్రేమించి, అతని కోసం తన తల్లిదండ్రులను వదులుకోవటానికి కూడా సిద్ధమయింది. ధనదత్తుడూ, గుహసేనుడూ పడవ ఎక్కి వెళ్ళిపోయేటప్పుడు, తన చెలికత్తె చేసిన రహస్యపు ఏర్పాటుతో, దేవస్మిత తన తల్లిదండ్రులకు తెలియకుండా ఇల్లు విడిచి వచ్చేసి, వారి పడవలో ఎక్కింది.

తామ్రలిప్తి చేరుతూనే ధనదత్తుడు తన కొడుకుకూ, దేవస్మితకూ మహా వైభవంగా వివాహం చేశాడు. వారిద్దరూ ఒకే ప్రాణంగా ఉంటూ సుఖంగా జీవించ సాగారు.

బి. నారాయణరావు



ఇలా కొంత కాలం గడిచాక ధనదత్తుడు చనిపోయాడు. వర్తక వ్యవహారా లన్నీ గుహసేనుడి పైన పడ్డాయి. అతన్ని బంధువు లందరూ వర్తకం మీద కటాహ ద్వీపం వెళ్ళవలిసి ఉన్న దని ఒత్తిడి చేశారు. దేవస్మిత మాత్రం అతని ప్రయాణానికి ఒప్పుకోలేదు. చాలా కాలం దూర దేశాల్లో వుండిపోవటం జరిగితే, తన భర్త మనసు ఇతర స్త్రీల పైకి పోతుందని ఆమె భయపడింది.

గుహసేనుడికి ఏం చెయ్యాలో తోచలేదు. కుల ధర్మం ఆచరించకపోతే బంధువుల దృష్టిలో తాను అసమర్థు డవుతాడు, వర్తకం మీద బయలుదేరితే భార్య బాధపడుతుంది.

ఈ చిక్కులో నుంచి బయట పడే దారి గానక గుహసేనుడు భగవంతుడి పైన భారం వేశాడు. అతడు శివాలయానికి వెళ్ళి, భోజనం మానేసి వ్రతం చేశాడు. దేవస్మిత కూడా భర్తతో బాటే వ్రతం చేసింది. చివరకు వా రిద్దరికీ శివుడు కలలో కనిపించి, చెరొక కమలమూ ఇచ్చి, "వీటిని మీ వద్ద ఉంచుకోండి. మీలో ఎవరు నీతి తప్పినా రెండో వారి వద్ద ఉండే కమలం వాడిపోతుంది. లేని పక్షంలో ఈ కమలాలు వాడిపోవట మంటూ ఉండదు," అని చెప్పాడు.



వాళ్ళు నిద్ర లేచి చూసుకుంటే, నిజంగానే ఇద్దరి చేతుల్లోనూ చెరొక కమలమూ ఉన్నది. ఇక దేవస్మిత తన భర్త ప్రయాణానికి అడ్డం చెప్ప వలిసిన అవసరం లేదు. అతని నీతికి సాక్ష్యం ఆమె వద్ద ఉండే కమలమే.

గుహసేనుడు రత్న వ్యాపారం చెయ్యటానికి కటాహ ద్వీపానికి బయలుదేరి వెళ్ళిపోయాడు. తన కమలాన్ని చీటికీ మాటికీ చూసు కుంటూ దేవస్మిత ఇంటి వద్దనే ఉండి పోయింది.

కటాహ ద్వీపంలో గుహసేనుడికి నలుగురు వైశ్య యువకుల పరిచయం లభిం



చింది. వాళ్ళు గుహసేనుడి వద్ద ఒక ఎర్ర కమలం ఉండటమూ, అది ఎంత కాలానికీ వాడక పోవటమూ గమనించారు. దాని రహస్య మేమిటో గుహసేనుడు బయట పెట్ట లేదు. అది ఎలాగైనా తెలుసుకోవా లను కుని, ఆ యువకులు అతన్ని అతిథిగా పిలుచుకుపోయి, బాగా తాగించి, ఆ కమలం గురించి నిజం చెప్పించారు.

అతనికి అంత నీతిపరు రాలైన భార్య ఉండటం వారికి నచ్చలేదు. అందుచేత ఆమె నీతికి ఎలాగైనా భగం కలిగించా లన్న పట్టుదలతో ఆ నలుగురూ బయలుదేరి తామ్రలిప్తికి వచ్చారు. అక్కడ వారి కొక

బౌద్ధ సన్యాసిని తటస్థపడి, దేవస్మిత ఈ నలుగురు వైశ్య యువకులనూ ప్రేమించేటట్టుగా తాను ప్రయత్నిస్తానని మాట యిచ్చింది.

ఆ పాపిష్ఠిది దేవస్మిత వద్దకు వెళ్ళి, ఆ మాటలూ ఈ మాటలూ చెప్పి, చివరకు తాను వచ్చిన పని బయట పెట్టింది; దేహ ధర్మాలను పాటించక పోవటం మహా పాప మనీ భర్తలు దీర్ఘ కాలం దూరంగా ఉన్నప్పుడు స్త్రీలు ఇతరులను ప్రేమించ వచ్చు ననీ చెప్పింది.

దేవస్మిత దాని సాహసానికీ, దాన్ని తన వద్దకు పంపిన వాళ్ళ సాహసానికీ ఆశ్చర్య పోయి, అందరికీ తగిన శాస్తి చెయ్యాలని నిశ్చయించుకున్నది. ఆమె సన్యాసిని మాటలకు సమ్మతించినట్టు నటించి, తనను ప్రేమించే వైశ్య యువకులను రోజు కొకణ్ణి చొప్పున తన వద్దకు రాత్రి వేళ పంపమని చెప్పింది. సన్యాసిని వెళ్ళినాక దేవస్మిత కుక్క కాలి గుర్తు గల ఇనుప ముద్ర ఒకటి తయారు చేయించింది. ఆమె తన పరిచారికలలో ఒకతెకు మంచి చీరె కట్టి, నగలు పెట్టి తన పాత్ర అభినయించ మని చెప్పి, మిగిలిన పరిచారికలు ఏ మేం చెయ్యాలో చెప్పింది.

ఆ రాత్రి మొదటి యువకుడు రాగానే పరిచారికలు వాడికి ఘనంగా స్వాగత మిచ్చి, ఉమ్మెత్త కలిపిన సారాయి తాగించి, ఇనప ముద్ర కాల్చి నుదిటి మీద వాత వేసి, ఒళ్ళు తెలియని స్థితిలో ఉన్న ఆ దౌర్భాగ్యుణ్ణి దూరంగా ఉన్న పెంట పోగు మీద పారేశారు.

మర్నా డుదయం వాడికి ఒళ్ళు తెలిసి, జరిగిన సంగతి గ్రహించి, నుదిటికి పైబట్ట అడ్డం చుట్టుకుని బసకు తిరిగి వెళ్ళాడు. వాడు మిగిలిన వారితో తనకు జరిగిన పరాభవం గురించి చెప్పలేదు. అందుచేత మిగిలిన వాళ్ళు కూడా అదేవిధంగా పరాభవం పొంది, అందరి వంతూ అయాక కటాహ ద్వీపానికి తిరిగి వెళ్ళారు. నలుగురు ప్రియులను పంపినందుకు తనకు దేవస్మిత గొప్ప బహుమాన మిస్తుందన్న ఆశతో బౌద్ధ భిక్షుకి కూడా వెళ్ళి, నుదిటి మీద వాత వేయించుకుంది.

ఈ విధంగా తన నీతిని చెడగొట్ట వచ్చిన నలుగురికీ శాస్తి చేసి దేవస్మిత తన అత్త గారికి జరిగిన సంగతంతా చెప్పింది.

"మంచి పని చేశావే, అమ్మాయి. కాని వాళ్ళు నా కొడుకు నేంచేసి పోతారో ?" అన్నది అత్తగారు.



"అత్తా, భయం లేదు. నేను కటాహ ద్వీపానికి వెళ్ళి నా భర్తను కాపాడు కుంటాను," అన్నది దేవస్మిత.

అత్తగారు సమ్మతించింది.

దేవస్మిత వర్తకుడి వేషం ధరించి, తన చెలికత్తెలకు కూడా అదే వేషం ధరింపజేసి, వర్తకం నెపం మీద ఓడ యెక్కి కటాహ ద్వీపానికి వెళ్ళింది. ఆమె అక్కడి రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, నా బానిసలు నలుగురు మా దేశం నుంచి పారిపోయి ఇక్కడికి వచ్చారు. మీ ప్రజల నందరినీ సమావేశపరిచినట్టయితే నేను వారిని గుర్తిస్తాను," అన్నది.

రాజు సరేనని తన పౌరులందరినీ సమావేశ పరిచాడు. వారిలో నుదుటికి గుడ్డలు చుట్టుకుని ఉన్న నలుగురు వైశ్యయువకులనూ చూపి దేవస్మిత, "వీరే నా బానిసలు!" అన్నది.

ఈ మాట వినగానే అక్కడి వైశ్య ప్రముఖులకు కోపం వచ్చి, "వీళ్ళు నీకు బానిస లెలా అయారు? వీళ్ళు ఇక్కడి వర్తకశ్రేష్ఠుల కొడుకులు," అన్నారు.

"నా బానిసలు కాకపోతే నా గుర్తుగల వాతల ముద్రలు వారి ముఖాల కెందుకుంటాయి? కావలిస్తే, వాళ్ళు నలుగురూ నుదుట కట్టుకున్న పట్టీలు విప్పమనండి," అన్నది దేవస్మిత.

రాజు ఆ నలుగురూ నుదుళ్ళకు అడ్డంగా కట్టిన గుడ్డలు తీయించాడు. నలుగురి ముఖాల మీదా కుక్కకాలి గుర్తు గల వాత లున్నాయి. వైశ్య ప్రముఖులు తీరని అవమానం పొందారు.

ఇందులో ఏదో తిరుగుడున్నదని రాజు గ్రహించి, వాస్తవంగా జరిగిన దేమిటో చెప్పమని దేవస్మిత నడిగాడు. ఆమె జరిగిన దంతా ఉన్నదున్నట్టు చెప్పింది. జనమంతా గొల్లున నవ్వారు.

రాజు ఆమెను మెచ్చుకుని, "వీళ్ళు నిజంగా నీ బానిసలే," అన్నాడు.

వైశ్య కుమారులు ఆమె బానిసలేనని రాజు ప్రకటించగానే అక్కడి వైశ్య ప్రముఖులంతా భారీగా చందాలు వేసుకుని దేవస్మితకు పెద్ద మొత్తం డబ్బు సమర్పించి, ఆ యువకులకు దాస్యవిమోచన అనుగ్రహించమని వేడుకున్నారు.

దేవస్మిత ఆ డబ్బు తీసుకుని, అక్కడి ప్రముఖుల సన్మానాలు అందుకుని, భర్తతో కూడా తామ్రలిప్తికి తిరిగి వచ్చింది.

ఆ తరవాత ఆ భార్యాభర్తలు ఒకరి నొకరు ఎడబాయకుండా ఐశ్వర్యంతో తులతూగుతూ సుఖంగా జీవించారు.





# నలుగురు మిత్రులు

కదంబ దేశపు రాజుకు గుణచంద్రు డనే కొడు కుండేవాడు. అతనికి మరి ముగ్గురు కుర్రవాళ్ళను, అతని వయసే గల వాళ్ళను జతపరిచి విద్యాభ్యాసం చేయించారు. మిగిలిన ముగ్గురూ ఎవరంటే, మంత్రి కొడుకు ధీమంతుడూ, వర్తకశ్రేష్ఠి కొడుకు మణిగుప్తుడూ, సేనాపతి కొడుకు జయంభరుడూనూ. ఈ నలుగురూ కలిసి పెరిగారు, కలిసి చదువుకున్నారు; విద్యాభ్యాసం పూర్తి చేసి గుణచంద్రుడు ఒక ఏడాది పాటు దేశ సంచారం చేసి, లోకజ్ఞానం సంపాదించుకు రావటానికి బయలుదేరి నప్పుడు మిగిలిన ముగ్గురూ అతని వెంట బయలుదేరారు.

ఈ నలుగురు మిత్రులూ దేశ సంచారం చేస్తూ మాళవదేశం వెళ్ళినప్పుడు గుణచంద్రుడు మాళవ దేశపు రాజకుమార్తె అయిన శశిరేఖను చూసి వరించి, పెళ్ళాడ గోరాడు. శశిరేఖ కూడా అతన్ని వరించింది, కాని ఆమె ఒక నియమం తెలిపింది. గుణచంద్రుడికి ముగ్గురు మిత్రులున్నట్టే, ఆమెకు కూడా జతగా ముగ్గురు ఇష్ట సఖులున్నారు. వారిలో ఒకతె మంత్రి కుమార్తే, మరొకతె ఆ దేశపు రత్నవర్తకుడి కుమార్తే, మూడోది సేనాపతి కుమార్తే. ఈ నలుగురూ ఒకేసారి పెళ్ళి చేసుకోవాలనీ, ఒకే చోటికి కాపరాలకు వెళ్ళాలనీ ప్రమాణాలు చేసుకుని ఉన్నారు.

అదృష్టవశం చేత గుణచంద్రుడికి కూడా ముగ్గురు స్నేహితు లున్నారు గనక, నలుగురు కన్యలూ, నలుగురు స్నేహితులనూ ఒకేసారి పెళ్ళాడి, ఒకే దేశానికి కాపరానికి వెళ్ళటానికి అవకాశం ఏర్పడింది. గుణచంద్రుడి మిత్రులు శశిరేఖ ఇష్ట సఖులను పెళ్ళాడటానికి సమ్మతించారు. నాలుగు జంటలకూ శాస్త్రోక్తంగా వివాహాలు జరిగాయి. నలుగురు మిత్రులూ తమ భార్య

జి. భవానీప్రసాద్



లను వెంటబెట్టుకుని కదంబ రాజధానికి తిరిగి వచ్చేశారు.

కొంతకాలం గడిచింది. గుణచంద్రుడి తండ్రి అయిన ముసలిరాజు చనిపోయాడు. గుణచంద్రుడు రాజ్యాభిషేకం చేసుకుని తన మిత్రులకే మంత్రి పదవీ, కోశాధిపతి పదవీ, సేనాపతి పదవీ ఇచ్చాడు. వారి నలుగురు భార్యలూ గర్భవతు లయి నలుగురికీ అమితమైన ఆనందం చేకూర్చారు.

ఒకనాటి సాయంకాలం రాజభవనం మిద్దె పైన నలుగురు మిత్రులూ తమ భార్యలతో సహా ఇష్టాగోష్ఠిలో ఉండగా ఒక గరుడపక్షి వచ్చి వారి సమీపంలో వాలి మనుష్య భాషలో గుణచంద్రుణ్ణి సంబోధించి ఇలా చెప్పింది:

"రాజా, త్వరలోనే ఈ స్త్రీలు నలుగురూ పిల్లల తల్లులు కాబోతున్నారు. కాని వీరికి పక్షి శాపం ఉన్నదని మీరు తెలుసుకోవాలి. వీళ్ళు నలుగురూ చిన్న పిల్లలుగా ఉన్నప్పుడు వనవిహారం చేస్తూ చిన్న చిన్న పక్షులను రాళ్ళతో కొట్టీ, రెక్కల పురుగులను పట్టుకొని రెక్క లూడబీకీ ఎంతో హింస చేశారు. పక్షులు వెళ్ళి తమ రాజైన గరుత్మంతుడితో మొరపెట్టుకోగా, గరుత్మంతుడు ఈ నలుగురినీ శపించాడు. ఆ శాపం ఏమిటంటే, వీళ్ళూ, వీరి భర్తలూ సంతానాన్ని కని, తమ కళ్ళతో చూసుకుని సంతోషించే సమయంలోనే ఆ బిడ్డలు చనిపోతారు; ఆ గర్భ శోకం వీళ్ళను పన్నెండేళ్ళపాటు బాధిస్తుంది. ఈ దుర్వార్త మీకు ముందుగా తెలియటం మంచి దని చెప్పాను," అని గరుడపక్షి ఎగిరిపోయింది.

ఈ మాటలు వినగానే అందరికీ పుట్టెడు దిగులు పట్టుకున్నది. వాళ్ళు చాలా సేపు తమలో తాము వితర్కించుకుని ఒక నిర్ణయానికి వచ్చారు. ఆ నిర్ణయ మేమిటంటే- నలుగురికీ ప్రసవ కాలం సమీపించగానే

దాదుల చేత ప్రసవం జరిపించి, పుట్టిన పిల్లలను పుట్టినట్టుగానే రాజ్యపు సరిహద్దు దాటించి, తగిన చోటికి పంపి, అక్కడ వాళ్ళు పెరిగి పెద్దవారయే ఏర్పాటు చూడాలి. పుట్టబోయే బిడ్డలను పెంచడానికి దేశపు పొలిమేర అవతల ఉండే విభాండకుడనే గురువును ఏర్పాటు చేసి, పన్నెండేళ్ళపాటు నలుగురు పిల్లలూ సుఖంగా జీవించటానికి తగిన సదుపాయాలన్నీ అమర్చారు.

ప్రత్యేకంగా తయారుచేసిన పురిటి ఇళ్ళలో నలుగురు స్త్రీలూ ఒకే రోజున నలుగురు మగ బిడ్డలను ప్రసవించారు. దాదులా పిల్లలను తల్లుల కంట కూడా పడనివ్వకుండా బయటికి తీసుకుపోయి, రాజభటుల ద్వారా విభాండకుడి ఇంటికి పంపేశారు.

పన్నెండేళ్ళు గడిచాయి. శశిరేఖా, ఆమె సఖులూ పక్షుల శాపం అనుభవించారు. వారు తమ పిల్లలను కళ్ళ చూసుకోలేదు, వారికి ముద్దు ముచ్చట్లు చేసుకోలేదు. పన్నెండేళ్ళపాటూ ఆ బిడ్డల కోసం అలమటించారు. శాప కాలం తీరిపోయింది. ఇక విభాండకుడి వద్ద నుంచి తమ పిల్లలను తిరిగి పిలిపించుకోవచ్చు.



కాని ఇప్పుడొక గడ్డు సమస్య ఏర్పడింది. ఆ నలుగురు పిల్లలలో ఎవరు ఎవరి కొడుకో తెలుసుకోవటం ఎలా? వాళ్ళను పోల్చటం తల్లిదండ్రుల వశం కాదు, విభాండకుడి వశమూ కాదు. తాము ఎవరెవరి బిడ్డలో పిల్లలకు మొదలే తెలియదు. కాని ఆ పిల్లలు ఎవరెవరి పిల్లలయినదీ పోల్చలేకపోతే చాలా చిక్కున్నది. ఎవరు రాజు కాబోయేవాడో, ఎవరు మంత్రి కాబోయేవాడో, ఎవరు కోశాధికారో, ఎవరు సేనాపతి కాబోయేవాడో, తెలియని పక్షంలో ఆ పిల్లలు నలుగురూ బతికి వుండీ చచ్చినవారి కిందనే జమ.



ఈ సమస్యను పరిష్కరించడానికి ముసలి మంత్రి పూనుకున్నాడు. ఆయన నలుగురు వృద్ధులకు చెప్పవలసిన దంతా చెప్పి, విభాండకుడి గురుకులానికి పంపాడు.

వాళ్ళు వెళ్ళి విభాండకుడితో మాట్లాడి, ఒక్కొక్క కుర్రవాణ్ణి ఒక్కొక్కరుగా తీసుకుపోతామని చెప్పారు.

విభాండకుడా కుర్రవాళ్ళకు నామకరణం కూడా చెయ్యక, వాళ్ళకు ఏకదళుడనీ, ద్విదళుడనీ, త్రిదళుడనీ, చతుర్దళుడనీ పేర్లు పెట్టి పిలుస్తూ వచ్చాడు. ఇప్పుడాయన ఆ కుర్రవాళ్ళను విడివిడిగా పిలిచి, "నాయనా, నిన్ను ఇంటికి తీసుకు పోవటానికి మీ తాతగారు వచ్చారు," అని చెప్పాడు.

పన్నెండేళ్ళు కలిసి పెరిగిన ఆ కుర్రవాళ్ళకు విడిపోతున్నామని దుఃఖం కలిగింది. తాము నలుగురూ ఒకే చోటికి పోతున్నట్టు వాళ్ళకు గురువు చెప్పలేదు. వాళ్ళు ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకుని, తమ కోసం వచ్చిన ముసలి వాళ్ళ వెంట వేరు వేరు మార్గాల బయలుదేరారు.

ఏకదళుడు ముసలివాడి వెంట వెళ్ళేటప్పుడు దారిలో ఒక దొంగ వారిని అటకాయించి, "మీ దగ్గిర ఉండేదంతా అక్కడ పెట్టండి. లేకపోతే చంపేస్తా," అన్నాడు.

ఏకదళుడు అకస్మాతుగా వాడి పైనపడి, చేతిలో ఉన్న కర్రలాక్కుని, దొంగను బాదాడు. దొంగ పడి పోయాడు. ఏకదళుడు దూరంగా కనిపించిన మనుషులను కేక పెట్టి పిలిచి, "ఈ దొంగను పెడరెక్కలు విరిచి కట్టి, మా వెంట తీసుకురండి. రాజుగారితో చెప్పి మీకు మంచి బహుమానం ఇప్పిస్తాను," అన్నాడు.

ద్విదళుడు వెళ్ళే దారిలో కూడా ఒక దొంగ ఎదురై, ఉన్న దంతా అక్కడ పెట్టమన్నాడు. ద్విదళుడు దొంగతో, "మా దగ్గిర ఏముంది, బాబూ? ఒంటి మీద ఉన్న

బట్టలే! కావలిస్తే తీసుకు పో!" అన్నాడు. ఈ లోపల వృద్ధుడు దూరంగా ఉన్న మనుషులను కేక పెట్టి పిలుస్తూ, "రండి, రండి! దొంగ! పట్టుకోండి!" అన్నాడు.

దొంగవాడు వాళ్ళకు దణ్ణాలు పెట్టి, "అయ్యా, ఈ సారికి నన్ను వదిలి పెట్టండి," అని బతిమాలాడు.

"ఎప్పుడూ ఇలాటి పాడు పనులు చెయ్యకు, వెళ్ళి, బుద్ధిగా బతుకు," అన్నాడు ద్విదళుడు. దొంగ వెళ్ళిపోయాడు.

ఈ లోపల మనుషులు వచ్చి, "దొంగ ఎక్కడ?" అని అడిగారు.

"ముసలాయన కంగారు పడి కేకలు పెట్టాడు. దొంగ లెవరూ లేరు," అన్నాడు ద్విదళుడు.

త్రిదళుడు మరొక వృద్ధుడి వెంట వెళ్ళే దారిలో కూడా దొంగ ఎదురయ్యాడు. త్రిదళుడు దొంగను అంత దూరాన చూస్తూనే, "దొంగ వస్తున్నాడు, పారిపో, తాతా!" అంటూ తాను కాలి సత్తువ కొద్దీ పారి పోయాడు.

చతుర్దళుణ్ణి కూడా దొంగ అటకాయించాడు. చతుర్దళుడు వాడి పై కలియబడి, వివశుణ్ణి చేసి, వాడి చేతులూ, కాళ్ళూ బంధించి, వాడి కత్తితోనే వాడి తల నరక



బోయాడు. ఎటునుంచో కొందరు బాటసార్లు అక్కడికి వచ్చి, "నాయనా, వాణ్ణి చంపకు, ఈ రాజ్యంలో హత్య చేసిన వారికి రాజు మరణ దండన విధిస్తాడు," అన్నారు.

"నన్ను చంపినా పరవాలేదు. కాని ఇలాటి కంటకులను బతికి ఉండనివ్వరాదు," అన్నాడు చతుర్దళుడు. ముసలివాడూ, మిగిలినవాళ్ళూ చతుర్దళుణ్ణి బలవంతాన నిగ్రహించి చేతిలోని కత్తిని లాక్కోకపోతే దొంగ తల తెగిపోయి ఉండేదే.

ఇంతకూ ఈ నలుగురు దొంగలూ నిజమైన దొంగలు కారు. ఆ దొంగలనూ, దారే పొయ్యేవాళ్ళనూ కూడా వృద్ధ మంత్రి

ఏర్పాటు చేసి, వాళ్ళ ద్వారా నలుగురు కుర్రవాళ్ళకూ పరీక్ష పెట్టాడు.

ముసలివాళ్ళు ఆ కుర్రవాళ్ళను రాజధానికి చేర్చేసరికి చీకటి పడింది. ఒక్కొక్క ముసలివాడూ తన వెంట వచ్చిన కుర్రవాణ్ణి ఒక నిర్జన గృహానికి తీసుకుపోయాడు.

ఏకదళుణ్ణి వెంట పెట్టుకు వచ్చిన వృద్ధుడు ఒక గదిలోకి ప్రవేశించి, "గదిలో ఏమున్నదీ చూడు, బాబూ," అన్నాడు.

"గాఢాంధకారంగా ఉంది. దీపం లేకుండా ఎలా తెలుస్తుందీ?" అన్నాడు ఏకదళుడు.

ద్విదళుడు అదే ప్రశ్నకు, "ఈ గదిలో భయం ఉన్నది," అన్నాడు. త్రిదళుడు చీకటి గదిలోకి వెళ్ళి, అందులో ఏమున్నదో చూడమన్న వృద్ధుడితో, "ఇందులో నిధి ఉన్నదేమో!" అన్నాడు.

చతుర్దళుడు చీకటి గది అంతా తడివి చూసి, "ఇందులో ఏమీలేదు," అన్నాడు.

మర్నాడు ఉదయం నలుగురు కుర్రవాళ్ళనూ వృద్ధులు రాజసభకు తీసుకుపోయారు. కుర్రవాళ్ళు ఒకరి నొకరు మళ్ళీ చూసుకుని, ఎంతో సంతోషించారు.

వృద్ధ మంత్రి గుణచంద్రుడితో, "నాయనా, నలుగురినీ పోల్చాను. వీళ్ళలో ఏకదళుడు నీ కొడుకు; వాడిలో క్షత్రియుడికి ఉండ దగిన గుణాలూ, రాజుకు తగిన లక్షణాలూ ఉన్నాయి. ద్విదళుడు నీ మంత్రి కొడుకు, నామనమడు; వాడిలో బ్రాహ్మణోచితమైన క్షమా, భావనా శక్తీ ఉన్నాయి. త్రిదళుడు జాగ్రత్తా, ధన చింతా గలవాడు, వైశ్య కుమారుడు. చతుర్దళుడు సేనాపతి కొడుకు, సాహసి, త్యాగశీలుడు!" అన్నాడు.

వృద్ధ మంత్రి వివరణ పిల్లల తండ్రులకూ, తల్లులకూ కూడా సమ్మత మయింది. ఎవరి కొడుకును వారు స్వీకరించి, అంతా సుఖంగా ఉన్నారు.





# కలల బేరం

ఒక ఊళ్ళో ఒక పేదరాలికి ముగ్గురు కొడుకు లుండేవారు. ఆమె భర్త సంసార భారం మొయ్యలేక, డబ్బు సంపాదించుకు వచ్చే వంక పెట్టి, అయిపు లేకుండా వెళ్ళిపోయాడు. దాంతో సంసార భారమంతా పేదరాలి పైన పడింది. ఆమె ఎంతో శ్రమపడి పిల్లల్ని పోషించు కుంటూ వచ్చింది. కొంత కాలానికి పెద్ద వాళ్ళిద్దరూ ఏదో విధంగా అక్కరకు వచ్చారు. పెద్ద కొడుకు నీళ్ళ కావళ్ళు మోసి, నాలుగు డబ్బులు తెచ్చేవాడు. రెండోవాడు గొర్రెల మందలను కాచేవాడు. మూడోవాడు బ్రహ్మన్న మటుకు ఎందుకూ పనికి రాకుండా, ఏ పనికీ వళ్ళు వంచకుండా తయారయాడు.

బ్రహ్మన్న తినటమూ, నిద్రపోవటమూ తప్ప మరే పనీ చెయ్యకపోవటం చూసి తల్లి, "ఎప్పుడూ మన్ను తిన్న పాములాగా అలా పడుకుని నిద్రపోతే పొట్ట గడవవద్దా? ఎక్కడైనా వెళ్ళి ఏదైనా పని దొరుకుతుందేమో చూడు," అన్నది.

"నిద్రపోతే మంచి మంచి కలలు వస్తాయమ్మా! వాటిని వదిలి పెట్టడం నా కిష్టం లేదు," అని బ్రహ్మన్న తనకు వచ్చే కలలు కొన్ని తల్లికి చెప్పాడు.

తల్లి వాడి మీద విసుక్కుని, "ఛీ, వెధవా! నీ కలలూ నువ్వూనూ! అవేమన్నా నీకు డబ్బు సంపాదించి పెడతాయా?" అన్నది.

ఈ సంభాషణ జరిగిన మర్నాడే బ్రహ్మన్న తల్లితో, "అమ్మా, నేను వెళ్ళి డబ్బు సంపాదించు కొస్తాను," అన్నాడు.

తల్లి సంతోషించి, "ఎక్కడికి పోతావు? ఏం పని చేస్తావు?" అని అడిగింది.

"రాత్రి నాకో కల వచ్చింది. అందులో ఒక జమీందారుగారు నా కలలను కొంటానన్నాడు. ఆ జమీందారుగారిని వెతు

ఎల్. రామకృష్ణయ్య





జమీందారుగారు బయటికి వచ్చి, బ్రహ్మన్నను చూసి "ఏమిట్రా ఆ కేకలూ?" అని అడిగాడు.

"నా పేరు బ్రహ్మన్నండి. నేను గంగమ్మ చిన్న కొడుకును. నాకు కలలు వస్తాయండి. నా కలలను మీరు కొన్నట్టు కల వచ్చిందండి. వాటిని మీ కమ్ముదామని వచ్చానండి," అన్నాడు బ్రహ్మన్న.

జమీందారు చాలా రకాల మనుషులను చూశాడు గాని, కలలు అమ్ముతానని వచ్చిన వాణ్ణెవణ్ణీ చూడలేదు. బ్రహన్న చూడ ముచ్చటగా కూడా ఉన్నాడు. వాడి వ్యవహార మేమిటో తెలుసుకుందామని ఆయనకు సరదా పుట్టి, "ఏమిటా కల? ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"నాకు భోజనం పెట్టి మీ ఇంట పడుకో నివ్వండి. నాకు కల వస్తుంది. ఆ కల మీరు కొనుక్కోండి. కల కేమాత్రం ఇస్తారండి?" అని బ్రహ్మన్న అడిగాడు.

"రెండణా లిస్తాను. సరేనా?" అని జమీందా రన్నాడు.

"రెండణాలు చాలా తక్కువండి. ఒక రూపాయైనా సంపాదించ కుండా ఇంటికి తిరిగి పోతే మా అమ్మ ఏ మంటుందండి?" అన్నాడు బ్రహ్మన్న.

క్కుంటూ వెళ్ళి ఆయనకు నా కలలు అమ్మి డబ్బులు తెస్తాను," అన్నాడు బ్రహ్మన్న.

"నోరు ముయ్యరా, పిచ్చికుంకా! ఎవరన్నా వింటే నవ్విపోతారు," అని తల్లి వాణ్ణి తిట్టింది.

కాని బ్రహ్మన్నకు తన కలలో పూర్తి విశ్వాసం ఉండటం చేత, వాడు తల్లి మాట లక్ష్యపెట్టక, తాను కలలో చూసిన జమీందారును వెతుక్కుంటూ బయలుదేరాడు.

పోగా పోగా వాడి కొక గ్రామం తగిలింది. అక్కడ ఒక జమీందారుగారి ఇల్లు కనబడింది. వాడా ఇంటికి వెళ్ళి, "ఏమండోయ్, దొరగారూ!" అని కేకలుపెట్టాడు.





"అయితే కలకు నాలుగణా లిస్తాను. నాలుగు కలలు అమ్మి రూపాయి తీసుకుపో!" అన్నాడు జమీందారు.

జమీందారుకు భార్య లేదు, ఒక్క కొడుకు మాత్రం ఉన్నాడు. ఇంటి నిండా రకరకాల పనివాళ్ళున్నారు.

బ్రహ్మన్న సుష్టుగా భోజనం చేసి ఒక మూల పడుకుని నిద్రపోయి, మర్నాడు లేచాడు. వాడు నిద్ర లేస్తూనే జమీందారు దగ్గిరికి పోయి, "అయ్యా, మీ తోటలో జామ చెట్టు మీద ఒక పంచరంగుల చిలక వాలి నట్టూ, దాన్ని మీరు పట్టుకుని పంజరంలో పెట్టి పెంచినట్టూ నాకు కల వచ్చిందండి," అన్నాడు.

బ్రహ్మన్న కల ఎటువంటిదో చూద్దామని జమీందారు అప్పటి కప్పుడే తోటలోకి వెళ్ళాడు. అయన జామచెట్టును సమీపించి చూసే సరికి, నిజంగానే చెట్టుకొమ్మ మీద పంచరంగుల చిలక కూర్చొని ఉన్నది. అది పెంపుడు చిలకలా గున్నది. మనిషి దగ్గిరికి రాగానే ఏవేవో మాటలు పల్లించింది. పట్టుకుంటే సులువుగా చిక్కింది. జమీందారు దాన్ని తెచ్చి, పంజరంలో పెట్టి ఇంట్లో ఉంచాడు. ఎవరే మాట అన్నా, ఆ చిలక వెంటనే దాన్ని అని వినోదం కలిగించేది.



జమీందారు బ్రహ్మన్నను పిలిచి, "బ్రహ్మన్నా, నిజంగా నీ కలలు డబ్బిచ్చి కొనదగినవే. మా యింట్లో ఏదైనా పనికి కుదురు. పని చేసినందుకు నీకు తిండీ, బట్టా ఇస్తా. అదిగాక కలలకు వేరే డబ్బిస్తా," అన్నాడు.

"కలలు కనటం తప్ప నాకే పనీ రాదు. తింటేగాని నిద్రరాదు. నిద్రపోతే గాని కల రాదు. నా కలలు కొనదలిస్తే మీరెట్లాగూ నాకు కడుపు నిండా తిండి పెట్టక తప్పదు," అన్నాడు బ్రహ్మన్న.

"సరే, కడుపు నిండా తిని కలలు కంటూ ఉండు," అన్నాడు జమీందారు.





బ్రహ్మన్నకు రెండోనాడు మరో కల వచ్చింది. మధ్యాన్నం వేళ జమీందా రింటి ఆవరణలోకి ఎక్కడి నుంచో మంచి జాతికుక్క వచ్చిందిట. దానికి జమీందారు తిండి పెట్టించి దగ్గిర ఉంచుకున్నాడట. అది రాత్రిపూట జమీందా రింటి ఆవరణ లోకి ఎవరూ రాకుండా కాపలా కాసిందిట.

ఈ కల కూడా నిజమయింది. మధ్యాన్నం వేళ ఎక్కడిదో ఒక వేటకుక్క లాటిది జమీందా రింటికి వచ్చింది. ఆయన దాన్ని చేరదీశాడు. అది పగలు నిద్రపోయి తెల్లవార్లూ మేలుకుని ఉంటూ, దొంగలకు సింహస్వప్నంగా తయారయింది.

మూడోరోజు బ్రహ్మన్నకు మరింత గొప్ప కల వచ్చింది. వాడు జమీందారు దగ్గిరికి వెళ్ళి, "అయ్యా మన దక్షిణ పొలంలో తుమ్మచెట్టు మొదట్లో లంకెబిందె లున్నట్టు కల వచ్చింది," అన్నాడు.

"బ్రహ్మన్నా, ఈ కల బాగుందిరా. ఇది నిజమైతే నీకు రెండు పావలా లిస్తాను," అన్నాడు జమీందారు.

ఆ కల కూడా నిజమయింది. బ్రహ్మన్న చెప్పిన చోట జమీందారుకు లంకె బిందె లలో బంగారం దొరికింది.

"అయ్యా, రూపాయి పూర్తి అయింది. డబ్బిచ్చి నన్ను పంపండి. మా అమ్మ సంతోషిస్తుంది," అన్నాడు బ్రహ్మన్న.

"అప్పుడే ఏం తొందరా, బ్రహ్మన్నా? ఇంకో నాలుగు కలలు అమ్మి ఏకంగా రెండు రూపాయలు పుచ్చుకుపోదుగాని. మీ అమ్మ రెండింతలు సంతోషిస్తుంది," అన్నాడు జమీందారు. బ్రహ్మన్న సరే నన్నాడు.

మర్నాడు వాడికొక శుభమైన కల వచ్చింది. వాడు నిద్ర లేస్తూనే జమీందారుకు తన కలను గురించి ఇలాచెప్పాడు: "ఇలా తూర్పుగా పోతే ఒక దేవాలయం ఉంది. దాని పక్కన ఒక జేగురు రంగు గోడల ఇల్లున్నది. ఆ ఇంటో ఒక ముసలమ్మా,

చక్కని చుక్కలాటి అమ్మాయీ ఉన్నారు. నే నా యింటి దగ్గిరికి వెళ్ళేసరికి ఆ అమ్మాయి ముసలమ్మ చెవిలో రహస్యంగా ఏదో అన్నది. ముసలమ్మ నన్ను చూసి, ఆ పిల్లను పెళ్ళి చేసుకో మన్నది. నేను సరే నన్నాను. వెంటనే పెళ్ళి మేళం వినిపించింది. అదివింటూ నిద్ర లేచాను."

"నీ కలలన్నీ నేను కొంటూ ఉండగా ఆ పిల్లను నువ్వెలా పెళ్ళాడతావురా? నిజంగా ఆ పిల్ల అంత అందగత్తె అయితే నా కొడుక్కే చేసుకుంటాను. ముం దక్కడికి వెళ్ళి పిల్లను చూద్దాం పద," అన్నాడు జమీందారు.

ఇద్దరూ తూర్పుగా బయలుదేరి పోగా ఒక గ్రామమూ, గుడీ, గుడి పక్కన జేగురు గోడల ఇల్లూ కనిపించాయి. ఆ ఇంట్లో ఒక ముసలమ్మ కూడా ఉంది. జమీం దారా ముసలమ్మని, "మీ ఇంట్లో పెళ్ళి కొచ్చిన పిల్ల ఉందా ?" అని అడిగాడు.

"ఉంది బాబూ. నే నేమో కాటికి కాళ్ళు చాచుకుని ఉన్నాను. అది దొరికిన పిల్ల కావటం చేత ఎవరూ పెళ్ళాడ కుండా ఉన్నారు. కష్టపడి పెంచి పెద్దచేశాను. దాని గతి ఏంకానుందో. నాకు తిరునాళ్ళలో దొరికినప్పుడు మూడేళ్ళ పిల్ల. పన్నెండేళ్ళు పెంచాను. నా శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరయేలా గున్నది!" అన్నది ముసలమ్మ.

జమీందారు ఆ పిల్ల తన కూతురే అయి ఉంటుందని తెలుసుకున్నాడు. పన్నెండేళ్ళ క్రితం తిరనాళ్ళలో ఆయన కూతురు తప్పిపోయి దొరకలేదు. ఆ దిగులుతోనే జమీందారు భార్య మరణించింది.

ఆయన తన కూతురినీ, ముసలమ్మనూ ఇంటికి తీసుకొచ్చి, బ్రహ్మన్న కలలకు తిరుగు లేదు గనక, కూతుర్ని బ్రహ్మన్నకే ఇచ్చి పెళ్ళి చేసి, ఇద్దర్నీ తన వద్దనే ఉంచుకున్నాడు. బ్రహ్మన్నకు కలలబేరం బాగా కలిసి వచ్చింది.





# మంచికి మంచి-చెడుకు చెడు

పద్మ దేశంలో అగ్నిదత్తు డనే ప్రఖ్యాతి గల బ్రాహ్మణు డుండేవాడు. ఆయన రాజు గారి వద్ద నుంచి ఒక అగ్రహారం పుచ్చుకుని సుఖంగా జీవిస్తూ ఉండేవాడు. సోమదత్తుడూ, వైశ్వానరుడూ అని ఆయనకు ఇద్దరు కొడుకు లుండేవారు. సోమదత్తుడు అందగాడు, కాని మూర్ఖుడు. వైశ్వానరుడు బుద్ధిమంతుడూ, పండితుడూనూ. తండ్రి పోయాక అన్నదమ్ములు వేరు పడ్డారు. తమ్ముడు రాజసన్మానాలు పొందుతూ, సుఖంగా జీవయాత్ర సాగిస్తూ ఉంటే, సోమదత్తుడు క్షత్రియ కర్మలు చేస్తూ, నీచ సాంగత్యంలో పడిపోయాడు.

ఒకనాడు అగ్నిదత్తుడి మిత్రుడైన బ్రాహ్మణు డొకడు సోమదత్తుడితో, "చచ్చిపోయిన నీ తండ్రికి ఇలా అప్రతిష్ఠ తీసుకు రాకపోతే నీ తమ్ముణ్ణి చూసి అయినా సిగ్గు తెచ్చుకోరాదా?" అని మందలించాడు.

సోమదత్తుడు ఆ బ్రాహ్మడి పైన మండిపడి, కాలితో తన్నాడు. ఇది చూసిన కొందరు బ్రాహ్మణులను వెంట బెట్టుకుని, ఆ బ్రాహ్మణుడు రాజు వద్దకు వెళ్ళి, సోమదత్తుడి పైన ఫిర్యాదు చేశాడు. సోమదత్తుణ్ణి బంధించి తీసుకు రమ్మని రాజు తన భటులను పంపగా, సోమదత్తుడి అనుచరులు ఆ భటులను చంపేశారు.

ఈ సంగతి విని రాజు మండిపడి తగినంత మంది భటులను పంపి, సోమదత్తుణ్ణి పట్టి తెప్పించి, అతన్ని కొరత వేయవలసిందిగా ఉత్తరు విచ్చాడు. తన అన్నను అనుగ్రహించ వలసిందని వైశ్వానరుడు వేడుకున్నాడు. అతని పైన ఉండే ఆదరం కొద్దీ రాజు సోమదత్తుణ్ణి క్షమించి; అతనికి అగ్రహారంలో భాగం లేకుండా చేశాడు.

ఈ విధంగా జీవనోపాధిని పోగొట్టుకున్న సోమదత్తుడు మరొక బతుకుతెరువు లేక,

ఏ. భావనాచారి



సేద్యం చేసుకుని బతుకుదా మన్న ఉద్దే శంతో మంచి భూమి కోసం వెతుకుతూ అరణ్య ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ కొంత మేర సారవంతంగా ఉన్నట్టు కన బడింది. ఆ ప్రదేశం మధ్యన ఒక రావి చెట్టున్నది.

సోమదత్తు డా రావి చెట్టుకు ప్రదక్షిణం చేసి, వృక్ష దేవతకు నమస్కారం చేసి, పూజ చేసి, నైవేద్యం పెట్టి, రెండెడ్లను తీసుకొచ్చి అరక కట్టి, వ్యవసాయం సాగించాడు. అతను అహోరాత్రాలు పొలం లోనే ఉంటూ, ఇంటి నుంచి భార్య తెచ్చిన అన్నం తినేవాడు.

అతను చేసిన కృషికి ఫలితంగా పొలం బాగా పండి, కోతకు వచ్చింది. సరిగా ఆ సమయంలో పొరుగు రాజు సేన యుద్ధం మీద అటుగా పోతూ ఆ పొలాన్ని చూసి, పంటను కొల్లగొట్టింది. అది చూసి సోమ దత్తుడి భార్య ఏడ్చింది. సోమదత్తుడు మాత్రం చలించక, భార్యను ఊరడించి, సైన్యం కొల్లగొట్టగా మిగిలిన ధాన్యాన్ని ఇంటికి చేర్చి తిరిగి రావి చెట్టును పూజించి, దాని కిందనే కూర్చున్నాడు. ఆ రాత్రి అతను ఆ చెట్టు కిందనే ఒంటరిగా పడు కున్నాడు. అయితే అతనికి, తన శ్రమ



అంతా వృథా అయిపోయిం దన్న విచా రంతో నిద్ర పట్టలేదు.

ఆ రాత్రి అతనికి చెట్టు నుంచి ఈ విధంగా వినబడింది: సోమదత్తా, నిన్ను చూసి చాలా సంతోషించాను. నీ పేరు ఫలభూతి అని మార్చుకుని శ్రీకంఠ దేశానికి వెళ్ళు. అక్కడ ఆదిత్య ప్రభు డనే రాజు ఏలే రాష్ట్రం ఉన్నది. ఆ రాజు ఉండే ఇంటికి వెళ్ళి సంధ్యాగ్నిహోత్రమంత్రం పఠించి, 'మంచి చేసేవాడికి మంచి జరుగు తుంది; చెడు చేసేవాడికి చెడు జరుగు తుంది,' అని చెప్పు. నీకు మేలు కలుగు తుంది. నీకు సంధ్యాగ్నిహోత్రమంత్రం



రాదు. నేను నేర్పుతాను నేర్చుకో. నే నొక యక్షుణ్ణని తెలుసుకో!"

సోమదత్తుడు తన విచారాన్ని విడిచి పెట్టి, కంటికి కనిపించని యక్షుడి ద్వారా సంధ్యాగ్ని హోత్రమంత్రం నేర్చుకున్నాడు. తెల్లవారగానే అతను ఇంటికి వెళ్ళి, తన భార్యను వెంట బెట్టుకుని శ్రీకంఠ దేశానికి బయలుదేరాడు.

ఆదిత్య ప్రభుడు ఏలే దేశం వచ్చింది. సోమదత్తుడు రాజసౌధానికి వెళ్ళి, తన పేరు ఫలభూతి అని చెప్పుకుని, "మంచి చేసే వాడికి మంచి కలుగుతుంది; చెడు చేసే వాడికి చెడు కలుగుతుంది," అన్నాడు.

ఆ మాటలు విని అందరూ ఆశ్చర్య పడ్డారు. రాజైన ఆదిత్యప్రభుడు ఫలభూతి అన్న మాటలు విని ముచ్చటపడి, అతనికి అనేక బహుమానాలూ, అనేక గ్రామాలూ ఇచ్చేశాడు. ఫలభూతి యక్షుడి కృప వల్ల ఐశ్వర్యవంతుడు కావటమే గాక, రాజభవనంలో అందరికీ ఇష్టుడయాడు.

ఆదిత్య ప్రభుడి పట్టపు రాణి కువలయావళి చిన్న తనంలోనే డాకినీ మంత్ర సిద్ధి పొందింది. భర్తకు తెలియకుండా ఆమె ముగ్గుల మధ్య కూర్చుని భైరవార్చన చేసి, కల్లూ, సారాయీ, నర మాంసమూ నైవేద్యం పెట్టి, ఆకాశ గమనం లాటి శక్తులు సాధించింది.

ఒకనాడు ప్రమాద వశాన రాణి చేసే భైరవార్చన రాజు కళ్ళ పడింది. రాజు నిర్ఘాంతపోయి, "ఇదంతా ఏమిటి?" అని రాణి నడిగాడు.

"ప్రభూ, తమ మేలు కోరే నే నీ పూజ చేస్తున్నాను. నా చిన్న తనంలో కాళ రాత్రి అనే బ్రాహ్మణ స్త్రీ వద్ద ఈ ఉపాసన నేర్చుకున్నాను. నరమాంస భక్షణ చేస్తూ నేను డాకినీ చక్రవర్తినిని కూడా అయాను. నాతో బాటు మీరు కూడా ఈ ఉపాసన నేర్చుకున్నట్టయితే దేశంలోని రాజు

లందరూ మీకు ఓడిపోతారు," అన్నది కువలయాపళి తన భర్తతో.

"ఈ నరమాంస భక్షణ ఏమిటి? డాకినీ మంత్రసిద్ధు లేమిటి? రాజులను గెలవట మేమిటి? నే నీ పని చెయ్యను. ఇక ముందు నీవు కూడా ఇలాటి క్షుద్ర పూజలు చెయ్యటానికి వీలులేదు," అన్నాడు రాజు కోపంగా.

రాజిలా అనగానే రాణి ఆత్మహత్య చేసుకోబోయింది. ఆమె డాకినీ పూజ మానదని తెలుసుకుని, చేసేదిలేక రాజు తాను కూడా ఆ పాపిష్టి పూజలో చేరటానికి సమ్మతించాడు.

రాణి రాజుతో, "మీ కొలువులో ఉండే ఫలభూతి అనే బ్రాహ్మణ్ణి తినాలని నేను ఉద్దేశించాను. అతను ఉత్తమ జాతి పురుషుడు. అందుచేత అతని మాంసం తిని అర్చన చేస్తే సిద్ధి త్వరగా కలుగుతుంది. అందుకు మీ సహాయం కావాలి. మన వంటవాడు నాకు లోగడ నరమాంసం వండి ఇస్తూ ఉన్నాడు. అతనితో ముందుగా ఒక సంకేతం చెప్పి వుంచుదాం. మీరు ఫలభూతిని ఆ వంటవాడి వద్దకు పంపి, 'రాజూ, రాణీ భోజనానికి సిద్ధంగా ఉన్నారు,' అని చెప్పించండి. అది సంకేతంగా



గ్రహించి వంటవాడు ఆ మాట చెప్పిన మనిషినే చంపి వండుతాడు," అన్నది.

ఈ పని చెయ్యటానికి రాజు చాలా భయపడ్డాడు. కాని గత్యంతరం లేదు. అందుచేత అతను వంటవాడితో, "నీ దగ్గిరికి ఒక మనిషిని పంపుతాను. ఆ మనిషి వచ్చి నీతో, 'రాజూ రాణీ భోజనానికి సిద్ధంగా ఉన్నారు,' అని చెబుతాడు. వెంటనే ఆ మనిషిని చంపి వండు," అని చెప్పాడు.

తరవాత ఆయన ఫలభూతిని పిలిచి, "నీవు వంటవాడి వద్దకు వెళ్ళి, 'రాజూ రాణీ భోజనానికి సిద్ధంగా ఉన్నారు,' అని చెప్పు," అన్నాడు.

ఫలభూతి పాకశాలకు బయలుదేరి పోతుండగా దారిలో రాజు కొడుకు చంద్రప్రభుడు కనిపించి, ఫలభూతికి కొంత బంగారం ఇచ్చి, "మా నాన్నగారికి చేయించావే అలాటి కుండలాలే నాక్కూడా కావాలి. ఇప్పుడే వెళ్ళి చేయించు," అన్నాడు.

"అలాగే పోతాను. నువు వంటవాడి దగ్గిరికి వెళ్ళి, రాజూ రాణీ భోజనానికి సిద్ధంగా ఉన్నారని చెప్పు," అంటూ రాజు కొడుక్కు చెప్పి తాను కుండలాలు చేయించ బోయాడు.

రాజకుమారుడి నోట సంకేతం వింటూనే వంటవాడు ఆ కుర్రవాణ్ణి చంపి, వండి, రాజుకూ, రాణీకీ పెట్టాడు. వాళ్ళు దాన్ని తినేశారు. తాను ఫలభూతిని చంపించా ననుకుని రాజు ఆ రాత్రంతా పశ్చాత్తాపంలోనే గడిపాడు.

మర్నాడు ఉదయం ఫలభూతి కొత్త కుండలాలు పట్టుకుని రాజు వద్దకు రాగానే రాజు నివ్వెరపోయి, ఆ కుండలాల వృత్తాంతం తెలుసు కోవటం ద్వారా తన కొడుకు చచ్చాడని తెలుసుకుని, "హయ్యో, నాయనా!" అని గొల్లున ఏడుస్తూ తనను తాను తిట్టుకుని, రాణిని కూడా నానా తిట్లూ తిట్టాడు. మంత్రులు రాజు ప్రవర్తనను అర్థం చేసుకోలేక, "ఎందుకీ దుఃఖం? ఏం జరిగింది?" అని అడిగారు.

రాజు జరిగిన దంతా మంత్రులకు దాపరికం లేకుండా చెప్పేశాడు. మంత్రులు రాజు ముఖం చూడలేక తలలు వంచేసుకున్నారు. ఫలభూతి చెప్పినది అక్షరాలా నిజమయింది: మేలు చేసేవాడికి మేలు కలుగుతుంది; కీడు చేసేవాడికి కీడుకలుగుతుంది. రాజూ, రాణీ పుత్రశోకం భరించలేక పోయారు. వారికి జీవితం దుర్భరమై పోయింది. రాజు తన రాజ్యానికి ఫలభూతినే రాజుగా అభిషేకించి, తన భార్యతో కుడా అగ్ని ప్రవేశం చేశాడు.






# కుక్క బుద్ధి - మనిషి బుద్ధి

పొరుగూరి జమీందారు ఇంట పెళ్ళి వచ్చింది. పాపన్న ఉండే ఊరి కరణం పెళ్ళికి వెళుతూ పాపన్నను కూడా తోడుగా వెంట తీసుకుపోయాడు.

పెళ్ళికి మరొక గ్రామం నుంచి ఒక పండితుడు కూడా వచ్చాడు. నిజానికాయనది మిడిమిడి పాండిత్యం. అయితే వాళ్ళ ఊరు చుట్టు పక్కల ఆ మాత్రం తెలిసిన వాడు కూడా లేకపోవటంచేత గొప్ప పండితుడుగా చెలామణీ అవుతున్నాడు. ఆయన పెళ్ళి జరుగుతున్న చోట తన పాండిత్యం ప్రదర్శించటానికి విశ్వప్రయత్నాలు చేశాడు, కాని అతడి ఎత్తులు ఎవరిపైనా పారలేదు.

పెళ్ళి పూర్తి అయాక జమీందారు అనేక మందికి ఖరీదైన ఉన్ని శాలువలు బహూకరించాడు. వాటి పైన జమీందారు పేరు కుట్టి ఉన్నది. లోగడ రాజసన్మానం పొంది ఉన్నవాడు కావటంచేత పాపన్నకు కూడా ఒక శాలువ ముట్టింది. కాని మిడిమిడి పండితుడికి శాలువ రాలేదు. అనేకమంది పండితులకు శాలువలు ముట్టటం చూసి ఈ పెద్దమనిషి ఆశాభంగం పొందాడు.

పాపన్న శాలువ పుచ్చుకుని కరణం వద్దకు వచ్చి కూర్చుని, "నీతో రావటం మేలే అయింది. ఆరోజు కారోజు చలి ముదురుతున్నది. ఒక శాలువ కొందామా అనుకుంటున్నాను. ఆ బాధ తప్పిపోయింది," అన్నాడు.

ఆ సమీపంలోనే కూర్చుని ఉన్న మిడిమిడి పండితుడు, పాపన్న ఆహ్వానం కూడా లేకుండా వచ్చిన వాడనీ, అతనికి ఆ శాలువ అక్రమంగా వచ్చిందనీ అనుకున్నాడు. పాపన్న తీసుకున్నది ఆఖరు శాలువ. అది పాపన్న కివ్వని పక్షంలో తనకు వచ్చేదని కూడా ఆయన అనుకున్నాడు. ఎందుకంటే



తాను పండితుడనే ఉద్దేశంతోనే తనను పెళ్ళికి ఆహ్వానించారు.

పాపన్నది ఏ ఊరు, ఏం పని అన్న విషయాలు పక్కవారి నుంచి అడిగి తెలుసుకుని ఆ పండితుడు, పాపన్న శాలువ కాజేసి తన పరువు నిలబెట్టుకోవాలనే ఉద్దేశంతో, అతన్ని కాస్సేపు పొగడి, తమ గ్రామానికి రావలిసిందిగా ఆహ్వానించాడు.

"నేను కరణంగారికి తోడుగా వచ్చాను. అందుచేత ఇప్పుడు రాలేను. మరొకసారి చూద్దాం," అన్నాడు పాపన్న పండితుడితో.

"అలా అయితే వచ్చే దశమినాటికి రండి. ఆ రోజు మా ఇంట సమారాధన చేసుకుంటున్నాం," అన్నాడు పండితుడు. పాపన్న సరేనన్న మీదట పండితుడు తన గ్రామం పేరూ, పాపన్న గ్రామం నుంచి దగ్గిర దారీ వివరించి చెప్పాడు.

పండితుడు తన గ్రామం చేరగానే, జమీందారుగారు ఏమిచ్చారని ఊళ్ళో వాళ్ళంతా అడిగారు. జమీందారుగారు తనను చాలా మెచ్చుకున్నారనీ, తన కొక ఉన్ని శాలువ బహూకరించారనీ, దాన్ని ఒక స్నేహితుడికి అరువిచ్చాననీ, దశమి నాటి కతను దాన్ని తెచ్చి ఇస్తానన్నాడనీ బొంకి, పండితుడు ఊరి వాళ్ళ దగ్గిర తన పరువు నిలబెట్టుకున్నాడు.

అష్టమినాడే పాపన్న పండితుడి ఊరికి బయలుదేరాడు. ఎందుచేతనంటే ప్రయాణం ఒక్క రోజులో పూర్తికాదు. దారిలో తిండి కూడా సరిగా అమరదు. రాత్రి వేళ చలి మరీ జాస్తిగా ఉంటున్నది. అందుచేత పాపన్న జమీందారిచ్చిన శాలువ మీద కప్పుకుని, ఇన్ని అటుకులూ పెరుగూ కలిపి మూట కట్టుకుని వేకువజామునే ప్రయాణమైనాడు.

ఆ రోజల్లా ప్రయాణం చేసి పాపన్న ఆ రాత్రికి ఒక గ్రామం చేరుకుని, అక్కడ సత్రంలో పడుకున్నాడు. అక్కడి నుంచి

అతను ఇంకా జాము రాత్రి ఉందనగా బయలుదేరి కొద్ది దూరం వచ్చేసరికి ఒక చోట మనిషి మూలుగుతూ ఉండటం విన పడింది. ఆ సమయంలోనే కుక్క కూడా అరిచింది.

పాపన్న దగ్గిరగా వెళ్ళి చూసేసరికి ఒక మనిషి బాగా దెబ్బలు తిని పడి ఉన్నాడు. పక్కనే అతని కుక్క కుంయి, కుంయి మంటున్నది. పడి ఉన్న మనిషి ఒంటిన అంగవస్త్రం తప్ప ఏమీ లేదు. అతను చలికి బిగుసుకుపోయి వణుకుతున్నాడు.

పాపన్న ఆ మనిషిని లేపి కూర్చోబెట్టి, తాను కప్పుకున్న శాలువ తీసి ఆ మనిషికి కప్పాడు. కొద్ది సేపటికి ఆ మనిషికి కాస్త ప్రాణ వచ్చినట్టయింది; "ఆకలి," అన్నాడు.

తాను తెచ్చుకున్న అటుకుల చద్దిలో సగం కిందటి రోజు ప్రయాణంలో పాపన్న తినేశాడు. ఈ రోజు ప్రయాణానికి సరిపడేది అతని వద్ద ఇంకా ఉన్నది. పాపన్న అది తీసి ఆ మనిషికి పెడుతూ, అందులో కొంచెం కుక్కకు కూడా వేశాడు. తరవాత అతను ఆ మనిషిని, "ఏం జరిగింది? ఎందు కిక్కడ ఇలా పడి ఉన్నారు?" అని అడిగాడు.

"ఏం చెప్పేది, బాబూ? నా తల రాత!" అన్నాడా మనిషి.




పాపన్న ఆ మనిషి సమాధానానికి ఆశ్చర్యపోయి, ఇంకేమీ అడగకుండా, తాను సాయం పట్టి అతన్ని వాళ్ళ ఇంటి దాకా తీసుకుపోయాడు. ఆ ఇల్లు పాపన్న విడిచి వచ్చిన గ్రామంలోనే ఉన్నది.

పాపన్న తలుపు తట్టితే ఆ మనిషి భార్య తలుపు తెరిచింది. "మీరు మళ్ళీ ఇటే వస్తారుగా?" అంటూ ఆ మనిషి లోపలికి పోయి తలుపు వేసుకున్నాడు.

ఆ మనిషి ప్రవర్తన పాపన్నకు వింతగా కనపడిందే గాని, అతనికి ఒకరిని విమర్శించే అలవాటు లేదు. అందుచేత అతను ముందుకు సాగి వెళ్ళాడు.




దారిలో పాపన్నకు తిండి లేదు. సూర్యాస్తమయం కాగానే చలి హెచ్చింది. కొంచెం పొద్దుపోయి అతను పండితుడి గ్రామం చేరి, ఇల్లు కనుక్కుని వారింటికి వెళ్ళాడు. శాలువ లేకుండా వచ్చిన పాపన్నను చూసి పండితుడు, "ఇదేమిటి? ఇంత చలిలో శాలువ అయినా కప్పుకో కుండా ప్రయాణం చేశారా?" అన్నాడు.

"శాలువ తెచ్చుకున్నాను. కాని దారిలో అది ఒకందుకు వినియోగ మయింది లెండి. సమారాధన రేపే గాబోలు. ఏమైనా పనులుంటే చెప్పండి, చేసిపెడతాను," అన్నాడు పాపన్న.



"సమారాధనా? అది ఒక నెల వాయిదా పడింది. తలవని తలంపుగా నా భార్యకు రోగం పెట్టుకొచ్చింది," అంటూ పండితుడు ఇంటి లోపలికి తొంగి చూశాడు.

మరు క్షణమే పాపన్నకు ఆడదాని మూలుగు గట్టిగా వినిపించింది. పండితుడి పిల్లలిద్దరు నోట్లో వేళ్ళు వేసుకుని పాపన్న కేసి కన్నార్పకుండా చూస్తూ దిగాలుపడి నిలబడి ఉన్నారు.

"అయ్యో! అలాగా? అయితే ముందామె విషయం చూడండి," అన్నాడు పాపన్న ఆదుర్దాగా.

పండితుడు లోపలికి వెళ్ళి తన భార్యతో, "ఆయన అది తీసుకు రాలేదు!" అన్నాడు.

"అయితే నాకీ మూలుగు కూడా దేనికి?" అన్నది భార్య, లేచి కూర్చుంటూ.

"ఆయన వెళ్ళిపోయినదాకా కాస్త పడుండవే!" అన్నాడు పండితుడు.

పండితుడి వెనకనే లోపలికి వెళ్ళిన పాపన్నకీ సంభాషణ వినిపించింది గాని, భార్యాభర్తలు దేని విషయం మాట్లాడుతున్నదీ తెలియలేదు. పండితుడు మటుకు తాను వెళ్ళిపోవటం కోసం ఎదురు చూస్తున్నట్టు అతను గ్రహించాడు. అతను పండితుడితో, "చూడండి, నా కోసం మీరేమీ



శ్రమ పడకండి. నే నీ రాత్రికి ఎక్కడో తల దాచుకుని తెల్లవారి మా గ్రామం వెళ్ళి పోతాను," అన్నాడు.

పండితుడు అతన్ని ఉండమన లేదు. పాపన్న శాలువ లేకుండా రావటంతో ఆయన ఎత్తు కాస్తా పాడైపోయింది.

పాపన్న ఆ రాత్రి గ్రామ చావడిలో పడుకుని, తెల్లవారుజామున బయలుదేరి మర్నాడు చీకటి పడే వేళకు తాను శాలువ దానం చేసిన వా డుండే ఊరు చేరుకున్నాడు.

అప్పటికి రెండు రోజులుగా పాపన్నకు తిండి లేదు. దాని పైన చలికి గురి అయాడు. జ్వరం తగిలినట్టుగా ఉన్నది. ఆ రాత్రికి శాలువ తీసుకున్న వాడి ఇంట ఇంత ఎంగిలిపడి, సుఖంగా నిద్ర పోతే తెల్లవారే సరికి ఉసులుగా ఉంటుం దను కున్నాడు పాపన్న.

అదృష్ట వశాన అతను గ్రామం ప్రవే శిస్తుండగానే ఒక కుక్క తోక ఆడించు కుంటూ పాపన్న కేసి వచ్చింది. క్రితం రోజు అతను పెట్టిన అటుకుల చద్ది మాట అది మరవలేదు.

పాపన్న కుక్క వెంట ఒక ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు. కిందటి రోజు తాను



కాపాడిన మనిషే వచ్చి తలుపు తీసి, "ఎవరు వారు?" అని అడిగాడు.

"నేనేనండి. తిరిగి మా ఊరు పోతున్నాను. జ్వరం తగిలింది. ఈ రాత్రికి మీ ఇంట పడుకుని తెల్లవారి వెళ్ళి పోతాను," అన్నాడు పాపన్న.

"ఇదేం సత్ర మనుకున్నావా? పద, సత్రానికి వెళ్ళి పడుకో," అన్నాడా మనిషి.

"మీకు శాలువ ఇచ్చిన వాణ్ణండీ," అని పాపన్న జ్ఞాపకం చేశాడు.

"శాలు వేమిటి? ఇవ్వట మేమిటి? పిచ్చి వాడిలాగున్నావే! పద, పద!" అన్నాడా మనిషి, మూల నుంచి కర్ర తీసి అదిలిస్తూ.

ఇది చూసి కుక్క తన యజమాని మీదనే గుర్రు మన్నది. యజమాని తన కుక్కను ఆ కర్రతోనే గట్టిగా కొట్టి, తలుపు వేసుకున్నాడు.

ఎదుటింటాయన ఇదంతా చూస్తూ ఉండి, పాపన్నను ప్రశ్నించి విషయమంతా తెలుసుకుని, సమీపంలోనే ఉన్న గ్రామాధికారి ఇంటికి తీసుకు పోయాడు.

గ్రామాధికారి ఇంట పాపన్నకు చక్కగా ఉపచారాలు జరిగాయి. అక్కడే అతనికి తాను కాపాడిన మనిషి గురించి తెలియ వచ్చింది. వాడొక హీనుడు. అస్తమానమూ జూద మాడతాడు. పెళ్ళాం నగలన్నీ అమ్మే శాడు, ఇంట్లో వస్తువులన్నీ అమ్మేశాడు. జూదంలో ఓడి డబ్బిచ్చుకోలేక ఎన్ని సార్లో చావు దెబ్బలు తిన్నాడు. కిందటి రాత్రి అలాగే తన్నులు తిని పడి ఉంటే పాపన్న వాణ్ణి కాపాడి ఉండ వచ్చు. కుక్క కున్న పాటి కృతజ్ఞత వాడికి లేదు!

మర్నాడు గ్రామాధికారి ఆ కృతఘ్నుణ్ణి పిలిపించి, పాపన్న ఇచ్చిన శాలువ సంగతి అడిగితే, తన కెవరూ ఏ శాలువా ఇవ్వ లేదన్నాడు వాడు. పాపన్న శాలువ మాట ఊరంతా పాక్కింది. ఆ ఊరి వర్తకు డొకాయన ఒక శాలువా తెచ్చి పాపన్నకు చూపి, "ఇది మీదేనేమో చూడండి. దీన్ని ఆ జూదగాడి దగ్గిర నిన్ననే ఇరవైరూపాయ లకు కొన్నాను," అన్నాడు.

శాలువ మీద జమీందారు పేరు కుట్టి ఉండటం చేత అది పాపన్నదే నన్న సంగతి సులువుగా రుజువయింది. గ్రామాధి కారి జూదగాణ్ణి మళ్ళీ పిలిపించి నిజం ఒప్పించి, వర్తకుడికి ఇరవై రూపాయలూ జూదరి తిరిగి యిచ్చేలా చేసి పాపన్న శాలువ పాపన్న కిప్పించాడు.

పాపన్న ఆ రోజల్లా అక్కడే విశ్రాంతి తీసుకుని, మర్నాడు తన గ్రామానికి తిరిగి వెళ్ళిపోయాడు.






రాముడు హనుమంతుణ్ణి పిలిచి, "హనుమంతుడా, నీవు రాక్షస రాజైన విభీషణుడి అనుమతితో లంకకు వెళ్ళి, రావణుడి ఇంట్లో ఉన్న సీత వద్దకు వెళ్ళి, నేను సుగ్రీవ లక్ష్మణులతో సుఖంగా ఉన్నాననీ, నా చేత రావణుడు చచ్చాడనీ చెప్పి, ఆమె ఏం చెబుతుందో తెలుసుకురా!" అన్నాడు.

హనుమంతుడు లంకా నగరం ప్రవేశించి, రావణుడి ఇంటికి వెళ్ళి, అక్కడ ఒక చెట్టు కింద రాక్షస స్త్రీల మధ్య దుఃఖదేవత లాగా కూర్చుని ఉన్న సీతను సమీపించి, తన పేరు చెప్పుకుని, వినమ్రుడై నిలబడ్డాడు. సీత వెంటనే అతన్ని గుర్తుపట్ట లేదు. ఆమె తనను గుర్తించి సౌమ్యురాలు కాగానే హనుమంతుడు ఇలా అన్నాడు:

"వైదేహీ, సుగ్రీవ లక్ష్మణ సమేతుడైన రాముడు కుశలంగా ఉన్నాడు. విభీషణుడి సహాయంతోనూ, వానర బలాల తోనూ ఆయన శత్రువును చంపేశాడు. ఆయన కార్యం సిద్ధించింది. రావణుడు మరణించాడు. లంక వశమయింది. 'ఇప్పుడు నీవు రావణుడి ఇంట ఉన్నప్పటికీ విభీషణుడి అధీనంలో ఉన్నావు కనక నీ కేమీ భయం లేదు, నీవు సుఖంగా ఉండవచ్చు. విభీషణుడు నిన్ను చూడవస్తాడు' అని రాముడు నీతో చెప్పమన్నాడు."

ఈ మాటలు విని సీత పరమానందం చెంది ఏమీ బదులు చెప్పలేక పోయింది. "ఏ మాలోచిస్తున్నావు? నాకేం చెబుతావు?" అని హనుమంతుడు హెచ్చరించిన మీదట





భావ్యం కాదు. ఏ జన్మలోనో చేసుకున్న పాపానికి ఫలితంగా ఈ కష్టాలన్నీ పడ్డాను. ఈ రాక్షస స్త్రీలు ఏ తప్పూ చేయలేదు. ఒక వేళ చేసినా ఉదారులు క్షమించవచ్చు. తప్పులు చెయ్యని వా రెవరుంటారు?" అన్నది సీత.

"అమ్మా, నీవు అన్ని విధాలా రాముడికి తగిన భార్యవు. రాముడి వద్దకు వెళ్ళి ఏం చెప్పమంటావు?" అన్నాడు హనుమంతుడు.

"నాకు నా భర్తను చూడాలని ఉన్నది," అన్నది సీత.

"రాముణ్ణి తప్పక చూస్తావులే," అని చెప్పి హనుమంతుడు రాముడి వద్దకు తిరిగి వెళ్ళాడు. అతను రాముడితో, "ఎంతో దుఃఖితురాలై ఉన్న సీతను వెళ్ళి చూడు. నీకు విజయం లభించిందని విని ఎంతో సంతోషించి, ఆమె నిన్ను చూడగోరుతున్నది," అన్నాడు.

రాముడి కంట నీరు వచ్చింది. అతనికి ఏం చెయ్యాలో తెలియలేదు; సీత చాలా కాలంగా రావణుడింట ఉన్నది. ఆమెను స్వీకరిస్తే అపకీర్తి, నిర్దోషిని నిరాకరించటం తప్పవుతుంది.

అతను విభీషణుడి కేసి తిరిగి, "నీవు సీతను చక్కగా స్నానం చేయించి, శరీరా

ఆమె తడబడుడూ, "ఈ సంతోష వార్త విని నా నోట మాట రావటంలేదు. నిన్నెలా ప్రశంసించాలో నాకు తెలియటంలేదు. నీ కివ్వదగిన కానుక కూడా ముల్లోకాల లోనూ కనబడదు," అన్నది.

"అమ్మా, నిన్ను అశోకవనంలో నానా దుర్భాషలూ ఆడిన ఈ రాక్షస స్త్రీలను చిత్రహింస చేసి, చీల్చి చెండాడాలని ఉన్నది. అనుమతి ఇయ్యి," అన్నాడు హనుమంతుడు.

"నాయనా, వీళ్ళు రావణుడి దాసీలు. యజమాని చెప్పినట్టు చెయ్యకపోతే శిక్ష పొందుతారు. వీరి పైన ఆగ్రహించటం



నికి గంధపు పూతలు పూయించి, నగలతో అలంకరించి త్వరగా ఇక్కడికి తీసుకురా," అన్నాడు.

విభీషణుడు వెళ్ళి తన స్త్రీల ద్వారా సీత కీ మాట చెప్పించాడు. సీత స్నానం చెయ్యకుండానే తన భర్తను చూస్తానన్నది, కాని విభీషణుడు, రాముడు చెయ్యమన్నట్టే చేస్తే బాగుంటుందని చెప్పాడు.

ఆడవాళ్ళు సీతకు తలంటి స్నానం చేయించి, శరీరానికి పూయ వలసిన పూతలన్నీ పూసి, మంచి నగలు పెట్టి, మంచి బట్టలు కట్టి, మంచి బట్ట పైన కప్పారు. చక్కని పల్లకీలో ఆమె నెక్కించి, అనేక మంది రాక్షసులను పరివారంగా పెట్టి విభీషణు డామెను రాముడున్న చోటికి తీసుకుపోయాడు.



సీతను ఎలా పరిగ్రహించటం, ఎలా త్యజించటం అని కొట్టుకుంటున్న రాముడికి, విభీషణుడు వచ్చి సీతను తెచ్చా నని చెప్పగానే సీత మళ్ళీ తన కంట పడుతుం దన్న సంతోషం కూడా కలిగింది. అతను విభీషణుడితో, "సీతను నా ముందుకు తీసుకురా!" అన్నాడు. విభీషణుడి ఆజ్ఞ పైన అతని భటులు అక్కడ మూగి ఉన్న వానరులను దూరంగా తోలేశారు. రాముడు విభీషణుడితో, "ఎందుకు వీరందర్నీ తరిమేస్తున్నావు? వీళ్ళు పరాయివాళ్ళు కారు, నా వాళ్ళే. ఆపత్సమయం లోనూ, స్వయంవరం లోనూ, పెళ్ళిళ్ళూ, యజ్ఞాలూ మొదలైనవి జరిగేటప్పుడూ స్త్రీలు ప్రజల మధ్యకు రావచ్చు. ఇది యుద్ధ భూమి, సీత నా వియోగంతో బాధపడుతున్నది. అందుచేత వీరంతా ఈ సమయంలో ఆమెను చూడవచ్చు," అన్నాడు.

విభీషణుడు వెళ్ళి సీతను రాముడి ఎదటికి తీసుకువచ్చాడు. రాము డన్న మాటలలో లక్ష్మణ సుగ్రీవాదులకు సీత పైన ప్రేమ ఉన్న లక్షణాలు కనబడక విచారం





కలిగింది. సీత సిగ్గు చేత ముడుచుకుపోతూ రాముడి ఎదటికి వచ్చింది. ఆమె వెనకగా విభీషణుడు వచ్చాడు. అంత మంది ఎదట తన ముఖం చూపలేక సీత చీరతో ముఖం కప్పుకుని, రాముడి కేసి చూస్తూ అతని కెదురుగా నిలబడింది.

రాముడు సీతను చూసి చాలా పరుషంగా ఇలా అన్నాడు:

"సీతా, పౌరుషవంతు డయినవాడు చేయగల పని చేశాను; శత్రువును చంపి, నిన్ను తిరిగి సంపాదించాను. శత్రువు నాకు చేసిన అవమానాన్ని కడిగేసుకున్నాను. నా శ్రమ ఫలించింది. నా ప్రతిజ్ఞ నెర



వేరింది. సుగ్రీవుడి ప్రయత్నమూ, విభీషణుడి ప్రయత్నమూ సఫల మయాయి. అయితే నే నిదంతా నీ కోసం చెయ్యలేదు, నా వంశానికి కలిగిన కళంకం పోగొట్టుకోవటానికి చేశాను. నాకు నీతో పని లేదు. నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళిపోవచ్చు. నే నీ మాట బాగా ఆలోచించే చెబుతున్నాను. చాలా కాలంగా పరాయి వాడి దగ్గిర ఉన్న దాన్ని అభిమానవంతుడెవడూ తిరిగి గ్రహించడు. నిన్ను ఎవరు పోషిస్తే వారి వద్ద ఉండు; లక్ష్మణుడు గాని, భరతుడు గాని, వానర రాజైన సుగ్రీవుడు గాని, రాక్షస రాజైన విభీషణుడు గాని నిన్ను పోషించవచ్చు. నీ కెక్కడ సుఖంగా ఉంటుందని తోస్తే అక్కడనే ఉండవచ్చు."

ఇంత కాలంగా పతి వియోగంతో కుమిలిపోయి, చివరకు అతని నోట అమృత వాక్కులు వినవలిసిన సీత ఇలాటి మాటలు విని నిలువునా కంపించిపోతూ కన్నీరు కార్చసాగింది. అతని నోట అలాటి మాటలెన్నడూ విన్నది కాదు, అందుచేత అవమానంతో ఆమె తల మరింత వాలిపోయింది. ఆమె గద్గద కంఠంతో ఇలా అన్నది:

"వీరుడా, అజ్ఞాని తెలియని మాట లన్న విధంగా ఈ కర్ణ కఠోరమైన మాట లెందు





శంటున్నావు? నీ వనుకున్నట్టుగా నేను ఏ దోషమూ చెయ్యలేదు. దుష్ట స్త్రీలను బట్టి స్త్రీ జాతి నంతటినీ శంకిస్తున్నావు. నీకు నా స్వభావం తెలుసు. అందుచేత అలాటి శంక విడిచిపెట్టు. నేను అధీనురాలినై ఉండగా రావణుడు నా శరీరాన్ని తాకితే ఆ తప్పు నాది కాదు. నా అధీనంలో ఉన్న మనస్సు మాత్రం నీ పైనే ఉన్నది. ఇంత కాలం కలిసి ఉన్న తరవాత కూడా నా స్వభావం నీకు తెలియకపోతే ఇక తెలిసే మార్గమే లేదు. హనుమంతుడు నన్ను వెతుకుతూ వచ్చినప్పుడే నన్ను విడిచిపెట్టినట్టు కబురు చేసి ఉంటే అప్పుడే ఆత్మహత్య చేసుకుని ఉందును; నీకూ నీ మిత్రులకూ, ఇంత శ్రమ లేకపోయి ఉండును. నన్ను అగ్ని సాక్షిగా పెళ్ళాడటం గాని, చాలా కాలంగా నన్నెరిగి ఉండటం గాని నీ కిప్పుడు ప్రమాణం కాలేదు."

సీత రాముడితో ఈ మాట అని లక్ష్మణుడితో, "లక్ష్మణా, ఇంత మాటపడి నాకు జీవించాలని లేదు. చితి పేర్పించు, నే నందులో ప్రవేశించి ప్రాణ త్యాగం చేస్తాను. పది మంది మధ్య భర్త చేత విడవబడిన భార్యకు మరో గతి లేదు," అన్నది. లక్ష్మణుడు అతి దీనంగా రాముడి ముఖం కేసి చూసి, సీత అగ్ని ప్రవేశం చేసి ఆత్మహత్య చేసుకోవటాని కతను సుముఖుడే నని గ్రహించి, చితి పేర్చాడు.

తల వంచుకుని ఉన్న రాముడికి సీత మెల్లిగా ప్రదక్షిణం చేసి, మండుతున్న చితి వద్దకు వచ్చి, దేవ బ్రాహ్మణులకు నమస్కారం చేసుకుని, చేతులు మోడ్చి, "నేను రాముణ్ణి తప్ప తలవకపోయి నట్టయితే, నన్ను గురించి రాముడికి కలిగిన శంక అబద్ధమైతే, నేను మనోవాక్కాయ కర్మల రాముణ్ణి అతిచరించక పోయి నట్టయితే సర్వ సాక్షి అయిన అగ్ని హోత్రుడు నన్ను సర్వ విధాలా కాపాడు





తాడు గాక!" అని చెప్పి, అగ్నికి ప్రదక్షిణం చేసి అందులో ప్రవేశించింది.

అది చూసి వానరులూ, రాక్షసులూ కూడా హాహాకారాలు చేశారు. ఆ హాహాకారాలు వింటూ రాముడు బాధతో అశ్రువులు రాల్చాడు.

అప్పుడు కుబేరుడూ, యముడూ, దేవేంద్రుడూ, వరుణుడూ, శివుడూ, బ్రహ్మ కాంతివంతమైన విమానాలలో లంకకు చేరి రాముడి వద్దకు వచ్చారు. వాళ్ళు చేతులెత్తి రాముడితో, "లోక కర్తవు, జ్ఞానావతారుడివి, సీత అగ్నిప్రవేశం చేస్తుంటే ఎలా చూస్తూ ఊరుకున్నావు?" అన్నారు.

"నేను దశరథుడి కొడుకు ననే అనుకుంటున్నాను. నేను పరమార్థంలో ఎవణ్ణో ఎందుకు పుట్టానో బ్రహ్మ చెప్పాలి," అన్నాడు రాముడు.

"నీవు సాక్షాత్తూ నారాయణుడివి. సీత లక్ష్మిదేవి. రావణ సంహారం కోసం ఈ భూలోకంలో మానవ జన్మ ఎత్తావు! రావణవధ చేశావు! ఇక వైకుంఠానికి రా!" అన్నాడు బ్రహ్మ.

బ్రహ్మ ఇలా అనగానే అగ్నిహోత్రుడు సీత నెత్తుకుని చితి నుంచి లేచి వచ్చాడు. అగ్నిహోత్రుడు మానవాకారం ధరించి పైకి లేవగానే చితి చెల్లాచెదరై పోయింది.

అగ్ని సీతను తెచ్చి రాముడి కిస్తూ, "ఇదుగో నీ సీత. ఈవిడ ఏ పాపమూ ఎరగదు. ఈమె మనస్సు ఒక్క క్షణమైనా నీ పై నుంచి మరొకరి పైకి మరల లేదు. ఆమె మనస్సు తన కేసి తిప్పాలని రావణుడు విశ్వప్రయత్నాలు చేశాడు. కాని అవేవీ ఫలించ లేదు. కనక ఈమెను పరిగ్రహించు. ఇది నా ఆజ్ఞ," అన్నాడు.

"సీత ఏ పాపమూ ఎరగదని నాకు తెలుసును. కాని సదాచారాన్ని గౌరవించి, ఆమె అగ్ని ప్రవేశం చేస్తుంటే చూస్తూ ఊరుకోవలిసి వచ్చింది. లేకపోతే లోకులు



నన్ను మోహాంధుడి కింద కట్టేస్తారు. అగ్ని కంటె కూడా పవిత్రమైన సీతను రావణు డేం చెయ్యగలడు? ఇప్పుడు సీత పాపరహిత అని మూడు లోకాలకూ వెల్ల డయింది. నే నామెను తప్పక పరిగ్రహిస్తాను," అని రాము డన్నాడు.

అప్పుడు శివుడు రాముడితో, "రామా, స్వర్గం నుంచి నీ తండ్రి దశరథుడు విమానంలో వచ్చాడు చూడు. ఆయన మాట నిజం చేసినందు వల్ల ఆయనకు ఇంద్ర లోకం లభించింది," అన్నాడు.

రామలక్ష్మణులు విమానంలో వచ్చిన దశరథుణ్ణి చూసి ఆయనకు నమస్కారం చేశారు. దశరథుడు రాముణ్ణి దగ్గిరికి తీసుకుని కౌగిలించుకుని, "నాయనా, నిన్ను ఎడబాసిన నాకు స్వర్గ సుఖాలు కూడా తృప్తికరంగా లేవురా. నిన్ను అరణ్యానికి పంపా నన్న మాటా, కైకేయి అన్న మాటలూ నన్నింకా బాధిస్తూనే ఉన్నాయి. అయితే, నీ పట్టాభిషేకానికి విఘ్నం కలిగించింది దేవతలే ననీ, రావణ సంహారం కోరి వా రా పని చేశారనీ నాకు తెలియ వచ్చింది. నీ వనవాసం పద్నాలుగేళ్ళూ తీరిపోయింది. ఇక నీవు అయోధ్యకు వెళ్ళి రాజ్యాభిషేకం చేసుకో. నిన్ను చూసి కౌసల్య చాలా సంతోషిస్తుంది," అన్నాడు.



ఆయన లక్ష్మణుడికీ, సీతకూ కూడా కొన్ని హితవాక్యాలు చెప్పాడు.

దశరథుడు స్వర్గానికి తిరిగి వెళ్ళిపోయాక ఇంద్రుడు రాముణ్ణి శ్లాఘించి, ఏదైనా వరం కోరుకో మన్నాడు. తన కోసం యుద్ధంలో చనిపోయిన వానర భల్లూకా లందరినీ తిరిగి బతికించమని రాముడు కోరాడు. ఇంద్రుడలాగే చేశాడు. చావగా మిగిలిన వానరులు చచ్చిన వానరులు తిరిగి బతకటం చూసి అత్యాశ్చర్యం చెందారు. తరవాత దేవత లంతా వెళ్ళిపోయారు.

రాముడా రాత్రి సుఖంగా నిద్రపోయాడు. మర్నాడు విభీషణుడు వచ్చి రాముణ్ణి స్నానం చేయిస్తాననీ, నగలూ, బట్టలూ ధరింపజేస్తా ననీ చెప్పి ఆహ్వానించాడు.

"ఆలాటి వన్నీ సుగ్రీవుడు మొదలైన వారికి చేయించు. పధ్నాలుగేళ్ళు పూర్తి అయిన మర్నాడు నేను తిరిగి రాకపోతే ప్రాణం వదులుతానని నా తమ్ముడు శపథం చేశాడు. వా డన్నంత పనీ చేస్తాడు. అలాటప్పుడు నాకు స్నానాలూ, వస్త్రాభరణాలూ దేనికి? నేను వెంటనే అయోధ్యకు వెళ్ళాలి," అని రాము డన్నాడు.

"ఒక్క రోజులో నేను నిన్ను పుష్పక విమానం మీద అయోధ్యకు చేర్చగలను. ఇంతకు ముందు కుబేరుడు వచ్చినా కూడా, అతని విమానం అతని కిచ్చెయ్యకుండా, నీ కోసం ఉంచాను. నేను నీకూ, నీ తమ్ముడికీ, నీ భార్యకూ ఇచ్చే ఆతిథ్యం తీసుకుని మరీ వెళ్ళాలని నా ప్రార్థన," అన్నాడు విభీషణుడు.

"నీ భక్తే నాకు చాలు. నా మనస్సు భరతుణ్ణీ, నా తల్లులనూ చూడాలని తహతహ లాడుతున్నది. నా వనవాసం పూర్తి అయింది. భరతుడు ఘోర ప్రతిజ్ఞ చేశాడు. నే నిక్కడ ఎలా ఉండను? ఈ పుష్పక విమానం ఇచ్చినదే నాకు పదివేలు," అన్నాడు రాముడు.






వరుణానదీ తీరాన అరుణాస్పద మనే నగరంలో ఒక బ్రాహ్మణ ప్రవరుడుండే వాడు. అతను నిష్ఠాపరుడు, ధర్మనిరతుడు, పరమ సాధువు, అర్ధరాత్రి అభ్యాగతులు వచ్చినా ఆతిథ్య మిచ్చేవాడు. అతనికి ప్రపంచ మంతా తిరిగి చూడాలన్న కోరిక ఒకటి తీవ్రంగా ఉండేది.

ఇలా ఉండగా అతని ఇంటికి ఒకనాడు ఒక యువకుడు అతిథిగా వచ్చాడు. అతను ఓషధుల ప్రభావం తెలిసిన మంత్రవేత్త. అతను ప్రపంచంలో గల రకరకాల వింతలు వర్ణించి చెబుతూంటే ప్రవరుడు, "అయ్యో, నీ వయసు ఆటే లేదు. ఇంత ప్రపంచం ఎలా చూశావు?" అని అడిగాడు. మంత్రౌషధ ప్రభావం వల్ల ఒక్క పూటలో అనేక యోజనాలు పోవచ్చునని చెప్పి ఆ అతిథి, "నీకు కూడా నా వలెనే దేశ సంచారం చెయ్యాలన్న కోర్కె ఉన్నట్టయితే నీ పాదాల కొక పసరు పూస్తాను," అన్నాడు.

ఆ పసరు ప్రభావంతో ప్రవరుడు మనో వేగంతో హిమాలయాలకు చేరుకుని, అక్కడి వింతలు చూస్తూ సంచరిస్తూండగా కాలి పసరు కాస్తా కరిగిపోయి, అత నింటికి తిరిగి రాలేని స్థితిలో పడ్డాడు. అదే సమయంలో అతనికి వరూధిని అనే గంధర్వ స్త్రీ వీణ వాయించటం వినపడింది. ప్రవరుడా ధ్వనిని బట్టి వరూధిని ఉన్న చోటికి వెళ్ళి, తాను ఇంటికి తిరిగి వెళ్ళటానికి దారి చెప్పమని ఆమెను వేడుకున్నాడు.

కాని వరూధిని ప్రవరుణ్ణి చూడగానే అతని అందానికి ముగ్ధురాలై, అతన్ని మోహించి, తనతో ఉండి పొమ్మన్నది. అందుకు ప్రవరుడు ఒప్పుకోక, "నేను అహితాగ్నిని. సాయంకాలం లోపున ఇంటికి చేరుకుని అగ్నిని అర్చించాలి," అన్నాడు.

వరూధిని అతన్ని ఎలాగైనా నిలపాలని విశ్వప్రయత్నం చేసింది. చివరకు ప్రవరుడు అగ్నిహోత్రుణ్ణి ధ్యానించి, ఆ దేవుడి అనుగ్రహంతో ఇల్లు చేరుకున్నాడు.

ప్రవరుడు వెళ్ళిపోయినందుకు వరూధిని విచారంగా కూర్చుని ఉండగా, ఆమెను ప్రేమించిన గంధర్వుడు, కలి అనే వాడు, ప్రవరుడి రూపమే ధరించి ఆమెను సమీపించి, తన మనసు మారినట్టుగా నటించాడు. వరూధిని ఆ వచ్చిన వాడు ప్రవరుడే అనుకుని అతనితో విహరించింది.

కొంత కాలానికి వరూధినికి ఆ గంధర్వుడి వల్ల ఒక తేజోవంతుడైన కొడుకు పుట్టాడు. అతనికి స్వతః తేజస్సు ఉండటం చేత స్వరోచి అన్న పేరు వచ్చింది. అతను ధనుర్వేదంతో సహా వేదాలన్నీ అభ్యసించి సర్వకళాప్రపూర్ణుడయాడు.

ఇతని సంగతి ఇలా ఉండగా, ఇందీవరుడనే విద్యాధరుడికి మనోరమ అనే కుమార్తె ఉన్నది. ఆమెకు విభావరీ, కళావతీ అని ఇద్దరు చెలికత్తెలు. విభావరి మందారుడనే విద్యాధరుడి కూతురు. కళావతి అనేది పారుడనే మునీశ్వరుడి కూతురు; పారుడు బ్రహ్మచారిగా ఉండగానే అతనికీ, పుంజికస్థల అనే అప్సరసకూ పుట్టింది; పుంజికస్థల ఆమెను కని,



విడిచిపెట్టి స్వర్గానికి తిరిగిపోగా, ఆ శిశువు చంద్రకళలను తాగుతూ పెరిగి కళావతి అని పేరు తెచ్చుకున్నది.

ఒకనాడు మనోరమ తన చెలికత్తెలయిన విభావరీ కళావతులతో సహా కైలాసగిరి తటాన విహారం చేస్తూ, ఎముకల గూడు లాగున్న ఒక తాపసిని చూసి నవ్వింది. ఆ తాపసి అలిగి, "ఓసీ, రాక్షసుడి వాత పడు!" అని శపించాడు.

ఆమె చెలికత్తెలు, "తపస్సు చేసుకునే వాడికి ఇంత కోపమేమిటి?" అన్నారు.

ఆ తాపసి వారి పైన కూడా మండిపడి, "మీరు ఘోర వ్యాధితో బాధపడండి," అని విభావరినీ, కళావతినీ శపించాడు. వెంటనే వారిద్దరూ రోగగ్రస్తులయారు.

ఆ తరవాత మనోరమ వెంట ఒక రాక్షసుడు పడ్డాడు. ఆమె భయభ్రాంతురాలై పరిగెత్తుతూ స్వరోచి కంటపడింది. స్వరోచి ఆమెను అడిగిన మీదట ఆమె తన సంగతీ, తన చెలికత్తెల సంగతీ అతనికి చెప్పి, "నాకు అస్త్రహృదయ మనే విద్య తెలుసును. అది రుద్రుడి నుంచి స్వాయంభువుకూ, ఆయన నుంచి వశిష్ఠుడికీ, తరవాత నా తల్లి వైపు తాత అయిన చిత్రాయుధుడికీ, ఆయన నుంచి వివాహ సమయంలో నా తండ్రికీ, ఆయన నుంచి నాకూ



లభించింది. ఆ విద్య చెబుతాను, దాని సహాయంతో నన్ను తరుముకొచ్చే రాక్షసుణ్ణి చంపు," అన్నది. స్వరోచి అలాగే చేశాడు.

నిజాని కా రాక్షసుడు మనోరమ తండ్రే. అతను ఒకసారి ఆయుర్వేదం చెప్పమని బ్రహ్మమిత్రుడనే ముని వద్దకు వెళ్ళగా, ఆ ముని నేర్పనన్నాడు. అప్పు డతను చాటున ఉండి, ముని శిష్యులకు ఆయుర్వేదం చెప్పుతుండగా విని అంతా నేర్చుకున్నాడు. ఆ విద్య తనకు పూర్తిగా వచ్చేశాక అతను మునిని చూసి సవ్వాపుకోలేక నవ్వేశాడు. ముని నిజం గ్రహించి, రాక్షసుడివి కమ్మని శపించాడు. ఇందీవరుడు ముని కాళ్ళ పైన పడగా, ముని అనుగ్రహించి స్వరోచి చేత చచ్చి శాప విమోచనం పొందమన్నాడు. ఇందీవరుడిప్పుడు శాప విముక్తుడై తన కుమార్తె మనోరమనూ, తనకు తెలిసిన ఆయుర్వేద విద్యనూ స్వరోచి కిచ్చేశాడు.

స్వరోచి మనోరమను పెళ్ళాడటానికి సిద్ధపడ్డాడు. కాని ఆమె తన చెలికత్తెలు రోగాలతో తీసుకుంటూండగా తాను సుఖపడలేనన్నది. అప్పుడు స్వరోచి ఆయుర్వేద విద్యతో విభావరికీ, కళావతికీ గల వ్యాధులను నయం చేసి, మనోరమతో బాటు వారిని కూడా పెళ్ళాడి సుఖంగా జీవించసాగాడు. కాలక్రమాన మనోరమకు విజయుడూ, విభావరికి మేరునందుడూ, కళావతికి ప్రభాసుడూ అనే కుమారులు కలిగారు.

ఒకనాడు అతను వేటాడుతూండగా వనదేవత ఆడ లేడి రూపంలో అతని ఎదటికి వచ్చి, "నేను నిన్ను ప్రేమించాను. నన్ను కౌగలించుకో," అన్నది. స్వరోచి ఆశ్చర్యపడి ఆ లేడిని కౌగలించుకోగానే ఆ వనదేవత స్త్రీ రూపంలో ప్రత్యక్షమై అతనికి నాలుగో భార్య అయింది. ఆమెకు దేవాంశ సంభూతుడైన కొడుకు కలిగాడు. అతనే స్వారోచిషమనువు.



# ప్రపంచపు వింతలు: 43. కోమోడో రాక్షసి బల్లులు

**మా**నవుడు అవతరించక పూర్వం భూమి మీద రాక్షసి బల్లు లుండేవి. అవి ఏనాడో అంతరించాయి. కాని వాటి సంతతి ఈ నాటికి కూడా తూర్పు దీవులలో నిలిచి ఉన్నది. కోమోడో, ఫ్లోరిస్, రింట్జా దీవులలో ఇవి ఉన్నాయి. వీటి నిడివి 14 అడుగుల దాకా ఉంటుంది. ఇవి మాంసాహారులు.



Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

మొగముపై మబ్బుతెర

పంపినవారు:
కె. వి. లక్ష్మి, అనకాపల్లి

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

కప్పుకున్న సిగ్గుతెర

పంపినవారు:
కె. వి. లక్ష్మి, అనకాపల్లి

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1965 ఆగస్టు నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 20.వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మొగముపై మబ్బుతెర

రెండవ ఫోటో : కప్పుకున్న సిగ్గుతెర

పంపినవారు : కాండ్రేగుల విజయభాగ్యలక్ష్మి,

అనకాపల్లి.

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


మానవసేవే మాధవసేవ!




జె. బి.
మంఘారామ్
& కంపెనీ



నిరాల
ఎక్కువ బట్టలను
శుభ్రపరచును



నిరాల
బట్టలను ఎక్కువ
తెల్లగా చేయును



నిరాల
వాటిని తొందరగా
శుభ్రపరచును







తుంగభద్ర ఇండస్ట్రీస్ లి. కర్నూలు

ASPIN-S

Roopkala

జగపతి పిక్చర్స్







అంతస్తులు





అంతస్తులు

దర్శకత్వం: వి. మధుసూదనరావు

నిర్మాత: వి. రాజేంద్రప్రసాద్, B.Sc.,






# అంతస్తులు

వాణీ రిలీజ్

